స్వధర్మగ్రంథమాలికా ప్రథమ పుష్పము.

# వీరశైవదర్శనము



(ప్రథమ ముద్రణము)
1959



ప్రకాశకులు:
శ్రీ పండిత బండారు తమ్మయ్యగారు
"స్వధర్మ" కార్యాలయము.
కాకినాడ.
తూర్పుగోదావరిజిల్లా.

స్వధర్మగ్రంథమాలికా ప్రథమ పుష్పము.

# వీరశైవదర్శనము



(ప్రథమ ముద్రణము)

1959



ప్రకాశకులు:

శ్రీ పండిత బండారు తమ్మయ్యగారు

"స్వధర్మ" కార్యాలయము.

కాకినాడ.

తూర్పుగోదావరిజిల్లా. వెల రు 0-8-0 లు

# విషయానుక్రమణిక



---

## శుద్ధ పత్రిక.

| అయిటమ్‌నెం | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 (3) | 20 | 16 | కూడి | కూడిన |
| | 20 | 20 | నిఖిల | నిఖిలభార |
| 2 | 5 | 22 | transcendent | transcen-dental |
| | 6 | 2 | soals | sonls |
| | 13 | 22 | సదుల | నదుల |
| | 19 | | Litarature | Literature |

# పీఠిక

ఆంధ్రరాష్ట్ర వీరశైవ (జంగమ) సంఘయాజమాన్యమునఁ బ్రకటితమగుచున్న "స్వధర్మ" పత్రికకు రెండేండ్లు నిండినవి. ఈ సంఘము తన యష్టమవార్షికోత్సవమును 1959 ఏప్రియలు 17, 18 తేదీలలో నెల్లూరుపురమున విజ్ఞానఖనులగు శ్రీ *T. H. M.* సదాశివయ్య *M. A. B. L.* గారి యాధిపత్యమున జరిగించియున్నది. ఆసందర్భమున శ్రీ సదాశివయ్యగారొసంగిన యధ్యక్షోపన్యాసము బహుముఖములుగ విజ్ఞానభరితమయియున్నది. దానిని "స్వధర్మ" 1959 మెయి, జూను నెలల సంచికలలోఁ బూర్తిగఁ బ్రకటించి యుంటిమి. నెల్లూరు మహాసభానంతరము కొలఁది దినములలోనే 1959 మెయి 9, 10 తేదీలలో శ్రీ బసవేశ్వర జయంతిపర్వము సంఘటిల్లినది. కావునఁ దత్సంస్మరకముగ "స్వధర్మ గ్రంథమాలికా ప్రథమ పుష్ప" రూపకముగ నొక చిన్నిపొత్తమును వెలువరించుట యావశ్యకమను సత్సంకల్పము శ్రీ సదాశివయ్యగారికి జనించినది. వారిసంకల్ప కల్పలతికాసంజనితమే యీ పుష్పోపహారము.

అనంతపుర వీరశైవసంఘమువారు 1955 సంవత్సరము ఏప్రియలు నెలలో తాము జరిగించిన బసవజయంతి మహోత్సవమునకు అధ్యక్షునిగా నన్నాహ్వానించి యుండిరి. ఆసందర్భమున నేనొసంగిన యధ్యక్షోపన్యాసమప్పటిలో ముద్రితము కాలేదు. ఏటేట ఆంధ్రవీరశైవసోదరులు, సమాజములు నెఱవేర్చు బసవజయంత్యుత్సవ సందర్భములలో యథోచితముగ నుపయోగించుకొనుటకయి కొంత యుపకరించునేమోయనెడి యూహతో నాఁటి యధ్యక్షోపన్యాసమును "బసవేశ్వరుని శీలము, జీవితతత్త్వము" అను పేరితో "స్వధర్మ" 1959 ఏప్రి

యలు సంచికలోఁ బ్రకటించియుంటిని. దీనిని సికింద్రాబాదు వీరశైవ సమాజమువారు, ఈసంవత్సరము బసవజయంతి సందర్భమున శ్రీ నిరంజనస్వామి గ్రంథమాల ప్రథమపుష్పముగాఁ బ్రకటించిన "బసవేశ్వరుని తత్త్వములు" అను గ్రంథమునందుఁ గూడ నాయనుమతితో ముద్రించికొనియున్నారు. 1920 సంవత్సర ప్రాంతమున బాల్యచాపల్యమున నేను "బసవేశ్వరుఁడు" అను శీర్షికతోఁ గొన్ని పద్యములువ్రాసియుంటిని. అవి యివి వఱలో 1922 సంవత్సరములో తెనాలి జంగమసంఘమువారు ప్రకటించిన ప్రభులింగలీల (వచనము) అను గ్రంథముచివర అనుబంధముగాను, ఆంధ్రపత్రిక క్రొత్త సంవత్సరాదిసంచిక, సారస్వత సర్వస్వము మున్నగు పత్రికలందును బ్రకటితములయినవి. తరువాత 1955 సంవత్సరము జనవరి 29, 30 తేదీలలో బసవకల్యాణ క్షేత్రమున జరగిన పదునాఱవ అఖిలభారతీయ వీరశైవమహాసభకు వెళ్ళినప్పుడు "కల్యాణ పురీప్రశంస" అను పేరితో కొన్ని పద్యములు వ్రాసియుంటిని. అవి ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రికలో సంతకుమున్ను ప్రకటితమయినవి. పూర్వోక్తమయిన అనంతపురము బసవజయంతినాఁటి యధ్యక్షోపన్యాసమును, పయి నుదాహరించిన పద్యములనుగూడ నొక్కచోఁ బ్రకటించుట మంచిదనితలంచి యామూఁటిని, శ్రీ సదాశివయ్యగారి నెల్లూరు మహాసభాధ్యక్షభాషణమును జేర్చి ప్రత్యేక గ్రంథరూపముగ శ్రీ సదాశివయ్యగారి యనుమతినిబడసియే యిట్లు ప్రకటించితిని. ఆంధ్రవీరశైవులు దీనిని యథోచితముగ నుపయోగించికొనెదరుగాకయని యభిలషించుచున్నాను.

వీరశైవమునకు శక్తివిశిష్టాద్వైతమను నామాంతరము విశ్రుతమయియున్నది. మైసూరులోని పంచాచార్య ప్రభాపత్రికాధిపతులు, శ్రీ కాశీనాథశాస్త్రిగారు కన్నడభాషలో ప్రకటించిన "శక్తివిశిష్టాద్వైతము" అను గ్రంథమున వారుగావించిన నిర్వాచనమునకు. శ్రీ సదాశివయ్యగారి ప్రస్తుతోపన్యాసమునఁ గావింపఁబడిన నిర్వాచనమునకు విధానములోఁ గొంతవిలక్షణతయున్నది. పరమేశ్వరునం దవినాభావముగనుండి జగత్సృష్టికెల్లఁగారణమయిన విమర్శశక్తియే, పరమాత్మయగు శివుని యెడ సూక్ష్మ చిదచిదాత్మకశక్తిగను, జీవాత్మ (భక్తుఁడు)యెడ స్థూలచిదచిదాత్మకశక్తిగను విభిన్నమయినదనియు, శివుని సూక్ష్మచిదచిదాత్మకశక్తి సర్వజ్ఞతా సర్వకర్తృతారూపకమయినది కాఁగా జీవునిస్థూలచిదచిదాత్మకశక్తి కించిద్జ్ఞత్వ,కించిత్కర్తృత్వరూపకమయినదనియు, ఇట్టి యుభయశక్తివిశిష్టులయిన జీవేశ్వరుల విశిష్టత్వము అనఁగా అద్వైతమును (లింగాంగసామరస్యము) ప్రతిపాదించునదియే శక్తివిశిష్టాద్వైతమని శ్రీ కాశీనాథశాస్త్రిగారి గ్రంథమందలి నిర్వాచనము. శివానుభవసూత్రము, విశేషార్థప్రకాశికమున్నగు గ్రంథములలోని నిర్వాచనమిందుకు విలక్షణముగనున్నది. అద్వితీయమగు పరబ్రహ్మమందలి విమర్శశక్తి ప్రభావమూలముననే తత్పరబ్రహ్మపదార్థము తనకుఁదానే యేకకాలమున ఉపాస్యుడు (శివుఁడు, లింగము) ఉపాసకుఁడు (జీవుడు, అంగము) అని రెండుభాగములుగా విభక్తమయినదనియు, ఆవిమర్శశక్తియే శివునియెడ "కలా" రూపకముగను, జీవునియెడ "భక్తి" రూపకముగను వరుసగ ప్రవృత్తి, నివృత్తిపరములుగ వర్తిల్లుననియు, లింగము జీవాత్మ

యందునుప్తమయియున్న పరబ్రహ్మాంశమే గాని వేఱుకాదనియు, భక్త్యతిశయముననే జీవాత్మ (అంగము) పరమాత్మ (లింగము) నధిగమించి యందైక్యమగుననియు, ఇందుకు సాధకములుగానే అష్టావరణ, పంచాచార, షట్స్థలవిచారాదికములు విధింపఁబడినవనియు నీ రెండవపక్షమునందలి నిర్వచన సరణి- బసవేశ్వరాది శివశరణుల వచన వాఙ్మయమువలనఁ గూడ నిదియే నిరూపితమగును. ఆనాఁటిశివానుభావుల యనుభవముగూడ నిదియే. ఇట్లెన్నియోవిధముల శ్రీ సదాశివయ్యగారు తమ భాషణమున శివతత్త్వముయొక్క యథార్థస్వరూపమును విశదీకరించిరి. లకులీశము, కాలాముఖము, గోళకీసంప్రదాయము మున్నగు పాశుపతమతాంతరశాఖ లన్నియు బసవేశ్వరాదు లుద్ధరించిన వీరశైవములోఁ గాలక్రమమున క్రీ॥ శ॥ 12,13,14 శతాబ్దులలో విలీనమయిన పరిస్థితులనుగూడఁ జక్కగా వివరించిరి. కావున శక్తివిశిష్టాద్వైత తత్త్వమును తెన్నుగాఁ దెలియఁ గోరువారికి వీరిభాషణము చాల సహకరింపఁగలదని నా యాశయము.



# బసవేశ్వరుని శీలము: జీవిత తత్త్వము

1955 ఏప్రిల్ అనంతపుర బసవజయంతి యధ్యక్షోపన్యాసము

ఉ. శ్రీగురులింగతత్పరు, డశేషజగన్నిధి, శుద్ధతత్త్వ సం
యోగసుఖప్రపూర్తి, వృషభోత్తమమూర్తి, యుదాత్తకీర్తి, ది
వ్యాగమమార్గవర్తి, బసవయ్యకృపాంబుధి మీకు దివ్య సం
భోగములన్ ప్రసాదసుఖభోగములం గరుణించుగావుతన్.

శ్లో. యస్సంగీతసిద్ధిర్వ్యసూవాపారభవం యేనాశ్రితం సూనృతం
యస్మైశ్వస్తియతిస్తదీయముదభూద్యద్వీరశైవవ్రతమ్
యస్యాపాంగసహోదరీచకరుణాయస్మిన్మహత్త్వాదయః
సత్వంత్రిజగంతి పాహిబసవా మాత్యేశ చూడామణే !

మహాజనులారా వీరశైవ సోదరులారా !

వీరపూజ, వీరారాధనము భారతీయులలోనే గాక సమస్త ప్రపంచమునందును చిరకాలమునుండి పరిపాటిగాజరుగుచున్నది. వీరుడనగా నవక్రపరాక్రమము నెఱపి శత్రుసంహార మొనర్చు శూరుడను భావము, సర్వసాధారణముగా వ్యవహారమునందున్నది. ఇట్టియర్థముననే రామాయణ వీరుడు శ్రీరాముడనియు భారతవీరుడు పార్థుడు(అర్జునుడు) అనియు గీర్తింపబడుచున్నారు. ఇట్లే ముప్పదిమూడు కోట్ల దేవతల మోది మోది దక్షయజ్ఞ ధ్వంస మొనర్చిన రుద్రావతారుడగు వీరభద్రునకు వీరశబ్దము పర్యాయముగ నేర్పడినది. కాని కేవలశౌర్యమే వీరధర్మముగా మనదేశముననేమి తదితరదేశములందేమి విజ్ఞానులగు పెద్దలు పరిగణించియుండలేదు. వీరశబ్దమున కించుమించుగ సమానార్థకముగ Hero అనుపదము ఆంగ్లభాషలో వ్యవహృ

తిమగుచున్నది. సుప్రసిద్ధ విద్వాంసుడు (Thomas Carlyle) తాను రచించిన Hero Worship (వీరారాధనము) అను గ్రంథములో Hero as a Poet, Hero as a Prophet, Hero as a Philosopher ఇత్యాదిగా వీరవర్గమును బలు విధములుగ విభజించి యున్నాడు. గీర్వాణ వాఙ్మయమును మథించి యలంకార శాస్త్రమును రచించిన మన యాలంకారికులుకూడ నాయా కావ్యనాటకములందలి నాయకులను దయావీరుడు, దానవీరుడు, ధర్మవీరుడు, మున్నగువిధములుగా వారి వారి ప్రధానోత్తమ గుణముల ననుసరించి నిర్వచించి యుల్లేఖించియున్నారు. కావున నొక భుజబలముచే శత్రుల నిర్జించి దేశ సౌభాగ్యమును గూర్చినవారేగాక తమకలము బలిమి (కవితాశక్తి) బుద్ధిబలము (తత్త్వజ్ఞానము), మత ప్రచారము(ప్రవక్తృత్వము)దయాదానధర్మాది సద్గుణగరిమత్వముల మూలమున సంఘము దేశము నుద్ధరించి దేశకల్యాణమునకు సాధకులయిన మహాపురుషులందఱుకూడ వీరశబ్దవాచ్యులయి తరువాతి తరములవారికి పూజనీయులగుచున్నారు. వీరశైవ వాఙ్మయమున "విశిష్టే నోచ్యతే విద్యాశివజీవైక్యబోధినీ తస్యాం రమతే యస్త్వసౌ వీర ఇత్యభిధీయతే" అని శివజీవైక్య విద్యా సాధకుని వీరుడని చెప్పఁబడియున్నది. కావున వీరశైవులెల్లరకు గూడ నామైక దేశమున వీరశబ్దము వ్యవహృతమగుచున్నది. పూర్వోదాహృతములయిన యుత్తమ గుణములెన్నియో పుంజీభవించి యేకాశ్రయమొంది యవతరించిన మహాపురుషుడు

క్రీ. శ. ౧౨వ శతాబ్దియందు కర్ణాట దేశమున హింగుళేశ్వర బాగవాడియందు జననమొంది పశ్చిమచాళుక్యాధీశుడగు బిజ్జలుని ప్రధానమంత్రియై, కూడలి సంగమేశ్వర చరణారవింద విలగ్న మిళిందాయమాన మానసుండై, జంగమవ్యసన మహిమ్నుండై, వీరశైవ మతోద్ధరణ మొనర్చి విశ్వజ్యోతియై వెలింగి చిరస్మరణీయుడైన కల్యాణ బసవేశ్వరుడు. అట్టి లోకోత్తర వీరుని యారాధన రూపకముగ వీరశైవలోక మేటేట యాతని జయంతి జరుపుట సిద్ధ్యుక్తధర్మమని వేఱుగ జెప్పనక్కఱలేదు. ఈ ధర్మనిర్వహణములో వ్యగ్రోత్సాహముల బ్రకటించు వీరశైవసంఘముల భాగధేయము ప్రశంసనీయము.

జగజ్జేగీయమానములయి. వీరశైవలోకమునకు నిత్య పారాయణములైన బసవేశ్వరుని గుణగణముల వివరించుటకు నేను సర్వథా యసమర్థుడను. ఆ మహనీయుని చరితమును రచించి హరీశ్వరుడు, పాలకురికి సోమనాథుడు, భీమకవి, సింగరాజు మున్నగు కర్ణాటాంధ్రకవులు తమ వాణిని పునీత మొనర్చి కృతి నాయకునితోపాటు తాముకూడ శాశ్వత యశశ్శరీరులై విరాజిల్లుచున్నారు. అందునను పాలకురికి సోమనాథు డాంధ్రుడయ్యు బసవేశ్వరు నెడ ప్రకటించిన భక్తి పారవశ్య మనన్యసామాన్యము. భీమకవికన్నడ బసవపురాణమునకు సోమనాథుని తెలుగు బసవపురాణమే మాతృకయని వేఱుగ జెప్పనక్కఱ లేదు. బసవని చరితమును సోమనాథుడు బసవపురాణమును

పేరితో పురాణరూపకముగ రచించుటయేగాక వృషాధిప శతకము, చతుర్వేదసారము, బసవోదాహరణ యుగ్మము, పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అష్టోత్తర శతనామగద్య, అక్ష రాంక గద్యపద్యములు, బసవరగడ, బసవాష్టకములు, పంచ రత్నములు, మున్నగు నెన్నియో లఘుకృతుల రూపమున గూడ వెల్లడించియున్నాడు. "బసవన్నమహిమ సంభద్వ్యక్తి యుక్తి బసరించితివి గద్యపద్యాది కృతుల నర్ణవావృత ధాత్రి యందొప్ప బసవ వర్ణనల్ చేసితి" వని భక్తులుగ్గడించి నట్లు లాతడు పండితారాధ్య చరిత్రావతారికలో వ్రాసికొన్నాడు. బసవేశ్వరుడు నాల్గులక్షల యిరువది నాల్గువేల గీతములు రచించినట్లు సోమనాథుడు తనబసవపురాణమున నుదాహరించి నాడు; బసవేశ్వర వచనములని కర్ణాట వాఙ్మయమున బ్రశస్తి గాంచిన యీగీతములలో శ్రీ హాలకట్టి, బసవనాళ్ మున్నగు పరిశోధకుల విశేషపరిశ్రమపూర్వకముగ నిప్పటికేతొమ్మిదివం దలోలభ్యమగుట దుస్తరమయినది. వేద వేదాంత సారములయి అసంఖ్యాకములగు బసవేశ్వరుని గీతములనేకములు కాలగర్భ మున నడగిపోవుట లోకముయొక్క దురదృష్టము. ఇట్టిగతియే సోమనాథుని బసవస్తవములకును ఘటిల్లినది; లెక్కకుమిక్కిలిగ నాతడురచించిన లఘుకృతులలో మనకు దొరకినవి బహుస్వల్ప ములు మాత్రమే. బసవజయంతిని జరుపుటలో శ్రద్ధానుభూతిని జూపు సంస్థలు, సంఘములు, వినష్టములయిన బసవగీతములను సోమనాథుని కృతులనుగూడ వెలికిదీసి ప్రకటించుటకయి తగిన

కృషిగావించి చరితార్థత నొందుదురుగాక యని ప్రార్థించు చున్నాను. బసవేశ్వరుని తత్త్వము, చరిత్రము గ్రహించుట కితరులు వ్రాసినకృతులు కన్న నాతడు స్వయముగ గేయరూపకములుగ రచించిన వచనములే యెక్కువ ప్రామాణ్యమును వహింపగలవనుట నిర్వివాదము. రానురాను ప్రక్షిప్తములు గూడ గొన్నిచేరి యాపేరితో వ్యాప్తిలోనికి వచ్చెనను, శైలి, భాష, లాలిత్యము, మాధుర్యము మున్నగు విశేషములబట్టి కర్ణాట విద్వాంసులు వానివి వేఱుపఱుప గల్గుదురనియే నావిశ్వాసము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అనునట్లు ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు భగవంతుడే దాని నుద్ధరించుటకయి యవతరించునని భారతీయుల విశ్వాసము. దక్షిణహిందూస్థానమున బసవేశ్వరుని కాలమునకు ముందిట్టి ధర్మగ్లాని గలిగి, బౌద్ధ, జైన, చార్వాకాది నాస్తికధర్మములు, ఆచరణశూన్యమగు సర్వాద్వైత ధర్మము ప్రబలి ప్రజలలో భక్తినశించి గుణములచేగాక జన్మము (కులము) చేతనే మానవుని యాధిక్యము గణ్యమై, యగ్రజన్ముల యొత్తిడి కోర్వజాలక సామాన్య మానవలోకము దారిగానక తహతహలాడుచున్నప్పుడు ధర్మస్థాపనము, వీరమతోద్ధరణమునొనర్ప పరమేశ్వరుడే తనకు వాహనము నభిన్నుడునగు నందీశ్వరు (ద్వితీయ శంభుని) బసవేశ్వరునిగా నవతరింపజేసెనని సోమనాథుని బసవపురాణమువలన దెలియుచున్నది. హరీశ్వరుడు

పేరితో పురాణరూపకముగ రచించుటయేగాక వృషాధిప శతకము, చతుర్వేదసారము, బసవోదాహరణ యుగ్మము, పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అష్టోత్తర శతనామగద్య, అక్ష రాంక గద్యపద్యములు, బసవరగడ, బసవాష్టకములు, పంచ రత్నములు, మున్నగు నెన్నియో లఘుకృతుల రూపమున గూడ వెల్లడించియున్నాడు. "బసవన్నమహిమ సంభవద్భక్తి యుక్తి బసరించితిని గద్యపద్యాది కృతుల నర్ణవావృత ధాత్రి యందొప్ప బసవ వర్ణనల్ చేసితి" వని భక్తులుగ్గడించి నట్టు లాతడు పండితారాధ్య చరిత్రావతారికలో వ్రాసికొన్నాడు. బసవేశ్వరుడు నాల్గులక్షల యిఱువది నాల్గువేల గీతములు రచించినట్లు సోమనాథుడు తనబసవపురాణమున నుదాహరించి నాడు; బసవేశ్వర వచనములని కర్ణాట వాఙ్మయమున బ్రశస్తి గాంచిన యీగీతములలో శ్రీ హాలకట్టి, బసవనాళ్ మున్నగు పరిశోధకుల విశేషపరిశ్రమపూర్వకముగ నిప్పటికేతొమ్మిదివం దలోలభ్యమగుట దుస్తరమయినది. వేదవేదాంత సారములయి అసంఖ్యాకములగు బసవేశ్వరుని గీతములనేకములు కాలగర్భ మున నడగిపోవుట లోకముయొక్క దురదృష్టము. ఇట్టిగతియే సోమనాథుని బసవస్తవములకును ఘటిల్లినది; లెక్కకుమిక్కిలిగ నాతడురచించిన లఘుకృతులలో మనకు దొరకినవి బహుస్వల్ప ములు మాత్రమే. బసవజయంతిని జరుపుటలో శ్రద్ధానుభూతిని జూపు సంస్థలు, సంఘములు, వినష్టములయిన బసవగీతములను సోమనాథుని కృతులనుగూడ వెలికిదీసి ప్రకటించుటకయి తగిన

కృషిగావించి చరితార్థత నొందుదురుగాక యని ప్రార్థించు చున్నాను. బసవేశ్వరుని తత్త్వము, చరిత్రము గ్రహించుట కితరులు వ్రాసినకృతులు కన్న నాతడు స్వయముగ గేయరూపకములుగ రచించిన వచనములే యెక్కువ ప్రామాణ్యమును వహింపగలవనుట నిర్వివాదము. రానురాను పరిశిష్టములు కూడ గొన్ని చేరి యాపేరితో వ్యాప్తిలోనికి వచ్చినను, శైలి, భాష, లాలిత్యము, మాధుర్యము మున్నగు విశేషము లబట్టి కర్ణాట విద్వాంసులు వానిని వేఱుపఱుప గల్గుదురనియే నావిశ్వాసము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనునట్లు ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు భగవంతుడే దాని నుద్ధరించుటకయి యవతరించునని భారతీయుల విశ్వాసము. దక్షిణహిందూస్థానమున బసవేశ్వరుని కాలమునకు ముందిట్టి ధర్మగ్లాని గలిగి, బౌద్ధ, జైన, చార్వాకాది నాస్తికధర్మములు, ఆచరణశూన్యమగు సర్వాద్వైత ధర్మము ప్రబలి ప్రజలలో భక్తినశించి గుణములచేగాక జన్మము (కులము) చేతనే మానవుని యాధిక్యము గణ్యమై, యగ్రజన్ముల యొత్తిడి కోర్వజాలక సామాన్య మానవలోకము దారిగానక తహతహ లాడుచున్నప్పుడు ధర్మస్థాపనము, వీరమతోద్ధరణమునొనర్ప పరమేశ్వరుడే తనకు వాహనము నభిన్నుడునగు నందీశ్వరు (ద్వితీయ శంభుని) బసవేశ్వరునిగా నవతరింపజేసెనని సోమనాథుని బసవపురాణమువలన దెలియుచున్నది. వాగీశ్వరుడు

వృషభముఖుడను ప్రమథుడు కొండొక శాపవశమున జనపడయి జన్మించెనని తన బసవరాజదేవ రగళెలో వ్రాసి యున్నాడు. ఏదిమైనను సిందలి ఫలితార్థ మించుమించుగ నొక్కటియే. సర్వమానవ సౌభ్రాత్రము బసవేశ్వరుని జీవితము నకు ప్రధాన సూత్రము. అందుచే స్త్రీ పురుష విభేదము, జాతి విభేదములేక యందఱుగూడ నాత్మజ్ఞానము గలిగి శివజీవైక్య సిద్ధిని బడసి తరించుట కర్హులనెడి వీరశైవ మతధర్మము నుద్ధ రించి క్రియారూపకముగ నతికాలములో నీమతమును కర్ణాట దేశమున విస్తరింపజేసిన మహావ్యక్తి బసవేశ్వరుడు. "దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయమ్ దీయతే క్షీయతే యస్మాత్ తస్మాత్ దీక్షేతి కథ్యతే" అను శివాగమ ప్రమాణ ముచే వీరశైవ దీక్ష నొందినంతనే సాధకుని యాణవిక, కార్మిక, మాయామలములు నశించిభౌతికశరీరము లింగశరీరముగ మారుటి యూతని తొంటికులములు, మలములు దగ్ధములయినట్లే గణింప దగునని, కావున వీరశైవదీక్షితులందఱు సోదరప్రాయులేయని, వారిపూర్వజాతిని స్థితిని స్మరించుట పాతక హేతువని శివాగ ములవలననే తెలియుచున్నది. కాని సనాతనమైన యీ ధర్మ ము నామమాత్రమై యాచరణ శూన్యమగుటచేపంచాచార్య స్థాపితమయిన వీరశైవము గుంటపూవులు పూయుచు బసవే శ్వరుని కాలమునాటికి చాల క్షీణదశయందుండుటచే "సంఘే శక్తిః కలౌయుగే" అనుసూక్తిని జింతించి సనాతన ధర్మము నుద్ధరించి వీరశైవ దీక్షాస్వీకారార్హత్వ విషయమున దేశమున

వేళ్లు వాఱియున్న వర్ణాశ్రమ వ్యవస్థ ననుసరించి పాటింపబడు చుండిన కాలవ్యవధి సంబంధిక నిర్బంధముల సడలించి, తొంటి కులములు నాచారము లెట్లున్నను దీక్ష యైనవెంటనే వీరశైవ విశిష్టములైన అష్టావరణ పంచాచారము లవలంబించినంతనే భ్రమరకీటన్యాయమున నంత్యజులుకూడ కులజులుగానే పరిగణింపబడి పూజింపదగుదురని బోధించి తన్మూలమున పతితజనోద్ధరణమునుకూడ సాధించి వీరశైవమతమును జీవకళా చైతన్యములతో బసవేశ్వరుడు సత్వరముగ విస్తరింపజేసెననియు, ఇదియే పంచాచార్యుల వ్యవస్థ కాతడు గావించిన ప్రధాన సంస్కరణమనియు, నేను తలంచుచున్నాను; ఆనాడు పంచాచార్యులతో బసవేశ్వరున కీవిషయమున ప్రతిఘటన ముండినట్టు లాధారము లేవియు లేవు. ప్రతిఘటన మేదయిననున్ననది స్మార్త బ్రాహ్మణులతోనే యని బసవ పురాణమును బట్టి ద్యోతకమగును. ఇట్టి విశాలహృదయుడగు సంస్కర్త యవతరించుటవలననే దక్షిణ హిందూస్థానమున వీరశైవము నేటికిని విస్తరించియుండ గల్గినది. అట్టివాడుత్తర హిందూస్థానమున నవతరింపకపోవుటవలననే పంచాచార్య సింహాసనములు రెండు కాశీ కేదారములయందు నిలిచియున్ననువీరశైవసంఘమచ్చట నామమాత్రావశిష్టముగ నుండుటయేర్పడినది. దీనినిబట్టియే నేటి వీరశైవసంఘము బసవేశ్వరుని ఘనకార్యముల కెట్లుఋణపడియున్నదో గ్రహింపదగును. బసవేశ్వరుడు గావించిన యీసంస్కరణము నుద్దేశించియే వేమనశివయోగి "ఉర్విවారి

కెల్ల నొక్కకంచముపెట్టి పొత్తుగుడిపి కులము పొలియజేసి తలనుజేయివెట్టి తెగనమ్మి చెప్పరా విశ్వదాభిరామ వినుర వేమ..." అని గానమొనరించినాడని నాయభిప్రాయము. బసవేశ్వరుడు గావించిన పతితజనోద్ధరణమూపతితజనుల యంతరంగ బహిశ్శుద్ధులకు దానకమయి శాశ్వతఫలదాయక మయినది. నేటి సంస్కర్తల హరిజనోద్ధరణ మట్టిదికాదు. అగ్రిజాతుల మనుకొనువారు, హరిజనులతో జేతులుచేతులు కలిపికొని తిరుగుటవలనను, వారికి దేవాలయములలో బ్రవేశ మొసంగినంత మాత్రిమునను వారికి వాస్తవముగ నొలికిన దేమియు లేదు. కావున వీరశైవ దీక్షామూలకముగ బసవడు కావించిన పతితజనోద్ధరణమునకు నేటివారి హరిజనోద్ధరణమునకు హాస్తిమశకాంతరమున్నది. త్రికరణశుద్ధి, లింగజంగమములయెడనభేదభావముతో తను మనోధన సమర్పణము, అనన్యశరణ్యాబుద్ధితో పరమేశ్వరుడగు కూడలి సంగమేశ్వరునందలి విశ్వాసము, అన్యదేవతా స్మరణ భజనరహితమగు నేకేశ్వరోపాసనము, పరసతీపరధనపరాఙ్ముఖత్వము ననునవి బసవేశ్వరుని శీలమునకు సహజాలంకారములు. ఇందుగూర్చిన హెచ్చరికలాతని వచనములలో బహుముఖముల బ్రస్ఫుటమగుచుండును. దయాసత్యశౌచములు లేని మానవునిజీతము నిరర్థకము; పురుషార్థములలో బ్రప్రథమమగు ధర్మమునకు దయయే మూలమని బసవేశ్వరుని యుద్ఘోషము. 'దయ యిల్లద ధర్మవదేవుదయ్యా' దయలేని ధర్మ మెట్టిదని యాతడు లోకమును

ధట్టించి ప్రశ్నించెను. అతని ధార్మికజీవనమున కాతని కరుణా
ర్ద్రహృదయమే మూలస్తంభము. బసవని ఈ యుత్తమ గుణ
విశేషము నెక్కుడుగా గణించి సోమనాథుడు 'నీవు దయాప
యోనిధివి' 'బసవయ్య కృపాంబుధి' 'యస్యాపాంగ సహోద
రీచ కరుణా' "ఇవ్వసుమతిఁ బుట్టిభక్తజనవత్సలుఁడైన కృపారస
ముద్రి!" ఇత్యాది వర్ణనముల జాలచేసినాడు. కరుణారస
మనుగ్రహించువానిని పరిగ్రహించువానిని నిరువురను పవిత్ర
మొనర్చునని షేక్స్పియరు మహాకవిగూడ వర్ణించినాడు. ఇక
దానవిషయములో నన్ని దానములలో నన్నదానమిన్న
యని 'నాన్నోదక సమందానమ్' ఇత్యాది సూక్తులలో మన
పెద్దలు ఘోషించియున్నారు. జీవికి దీనివలన గలుగుతృప్తి మరి
దేనివలన గలుగనేరదనుట సర్వానుభవసిద్ధము. జంగమశబ్దము వీర
శైవవాఙ్మయమున కులవాచకముగగాక చరలింగ (జీవరూపమున
చరించు శివుడు) ద్యోతకముగనే యుదాహృతమైయున్న సంగతి
విజ్ఞులెల్లరకు విదితమే. కావున నది శివభక్తులందఱకు గూడ
జెల్లునదియే. 'చరతీతిచరః' 'జంభృశంగచ్ఛతీతి జంగమ!' అను
వ్యుత్పత్త్యర్థములు గూడ దీనినే నిరూపించును. లింగమునకు
జంగమమే వదనమని చెప్పి జంగమసేవ వలననే లింగానందము
కలుగు ననెడి దృఢ విశ్వాసముతో తను మనోధనముల నెల్ల
నందుకయి వినియోగించిన భక్తి భాండారి బసవడు. నిత్యము
నాతడు లక్ష తొంబది యాఱు వేల జంగములకు గణార్చన
మొనర్చెడి వాడను వాడుక తరతరంబుల నుండి వినవచ్చుచు

న్నది. ఇట్లని సోమరిపోతులెల్ల బసవని యింట జేరి యాతని కందాలో విందు లారగించెడివారని లోకము భ్రమింపరాదు. బసవడొనర్చెడి జంగమదాసోహ వ్రతములో నర్థి దాత యను తారతమ్యమే లేదు. ఆనాటి శరణులు గూడ తృణీకృత హరి బ్రహ్మ పురందరులు. అట్టి కేవల శివభక్తి యను చేతి చింతామణియై యుండె బసవని వలెనే వారు గూడ తమ యాశ్రితార్థముల దామే పడయగల వలతులే గాని బడుగులు కారు. "కాయకమే కైలాస"మని గుర్తించి యేదో యొక కాయక మవలంబించి జీవితము నెఱపినవారే గాని సోమరులానాటి భక్తలలో లేనే లేరు. కట్టెల మారయ్య, కలకేత బ్రహ్మయ్య, మడివాలు మాచయ్య మున్నగు భక్తుల చరిత్రముల దిలకించిన నిందలి తత్త్వము తెలియనగును. కావున బసవని భక్తిగౌరవముల కలరియే యానాటి భక్తలోకమాతని సపర్యల స్వీకరించెడిదని మనము గ్రహింపదగును.

'నాకన్న పిన్నలు లేరు. శివభక్తులకన్న పెద్దలు లేరు. నీపాదసాక్షి. నా మనస్సాక్షి. కూడల సంగమ దేవా! నా కిదియే శ్రేష్ఠము' అను నర్థము గల "ఎన్నిందకిఱియరిల్ల శివ భక్తరిందహిరియ రిల్ల నిమ్మపాదసాక్షి ఎన్నమనసాక్షి కూడల సంగమదేవా! ఎనగిదే దివ్య" అను గీతము బసవని యహంకార శూన్యతకు ప్రబలాదర్శము. మఱియు భక్తులెల్ల సాక్షాత్తు కూడలి సంగమేశ్వరుని మాఱట మూర్తులే యని యాతని నిర్మలభావము. ఇందుకొక చిన్నదృష్టాంత ముదాహ

రింతును. బసవన్న యనుయాయులలో మడివాలు మాచయ్య పేరెన్నిక గన్నవాఁడు. త్రికరణశుద్ధిగా నాతఁడు బసవని కుద్దియైనవాఁడు. నిష్కాపట్యము గల నిష్ఠురవాది. బసవని భక్తి స్వర్ణ భాండారమున కాతఁడు నికషోపలము. (గీటురాయి) వంటివాఁడు. ఒకనాఁ డొక భక్తుఁడు, బసవని గీతము నొకటి మాచయ్యయెదుట పాడివినిపించెను. అందెందు చేతనో మాచయ్యాదృష్టి కించుక యహంకృతి చ్ఛాయ గోచరించెనట. అందు కెంతయుఁగినిసి బసవఁ డెంత యవివేకి యయ్యెనని, యా జంగమము నెదుట మాచయ్య యేమేమియో యుపన్యసించెను. అనంతర మీసంగతి నా జంగమము తెలుపఁగా బసవఁ డొక్క పరువున మాచయకడకేఁగి యాతని పాదములకెరఁగి "ఆక్రాంత సంతతాహంకార నిరతు, నక్రమాలాపు నిర్వక్రాప రాధు, నూర్జితక్రోధు వివర్జితసత్యు, దుర్జనాకారు, నవిర్జితకాము, నజ్ఞానపుంజమ్ము, నపగత శౌచు, విజ్ఞాన హీను, వివేక విదూరు, నిర్భాగ్యచూడామణిని, భక్తిరహితు, దుర్భావకు, నవినీతుని నన్ను నింక గాచి రక్షింపవే కారుణ్య పాత్ర! యేచిన మద్గర్వమెల్లమాయించి", ఇత్యాదిగా నాత్మనింద కావించికొని, "లాలితంబుగ నాల్గులక్షల మీఁద, నోలి నర్వదినాల్గు వేల గీతముల, గావించుటివియెల్ల గని యేవగించు, భావన నాకయ్యె నీవు గైకొనుమి, నాయతిప్రీతి నో యనఘాత్మ నింక, చాయనవయ్యయోసంగయ్యదేవ!" అనిమాచయ్య క్షమార్పణమును వేఁడికొనెను. గంభీర విగ్రహుఁడయి నెత్తివాచునట్లు నిష్ఠురోక్తుల నెట్ట

యెదుట తనతో నాడుచున్నది మాచయ్యయైనను అట్లు పలుకునది నిజముగ డగు సంగమేశ్వరుడే యను బసవని భావము గమనింప దగినది. "తండెనీను, తాయినీను, బంధునీను, బళగనీను, నీనల్లదె, మత్తారూ, ఇల్లయ్యా! కూడల సంగమ దేవా! హాలలద్దు, నీరలద్దు (తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగమునీవు, నీవుగాక ఇంకెవ్వరు లేరయా. కూడల సంగమ దేవా! పాలముంచుము, నీటముంచుము) సంగమేశ్వరుడే సకలమని నెమ్మనమ్మున మున్నరమ్ముగ నమ్మిన మహా భక్తునకే యిది చెల్లునుగదా!

బసవేశ్వరుడు ప్రజ్ఞా చక్షువని, మహారాజ సచివుడవుటచేత చారచక్షువని లోకమున కెఱుకపడిన విషయము. "పలు సందియముల దొలచును, వెలయించు నగోచరార్థ విజ్ఞానము లోకుల కక్షి శాస్త్ర మయ్యది,యులవడ దెవ్వనికి వాడె యంధుడు జగతిన్" అను సూక్తి కనుగుణముగ శాస్త్రజ్ఞుడగుటచే జ్ఞానచక్షుష్మంతుడనియు తెలియనగును. ఇట్లెన్నివిధముల చక్షుష్మంతు డయిన బసవనికి సోమనాథుడు విలక్షణముగా నొకతీరు జనుషాంధత్వమును (పుట్టుగ్రుడ్డితనమును) గల్పించినాడనిన నది మిక్కిలి విపరీతముగా గోచరింపకపోదు. అ దెట్టిదియో తిలకింపుడు. "పరవనితా జన భాసురతర ముఖ మండల వీక్షణ విధి జాత్యంధాత్" యని జెప్పిన విరోధము కవివర్ణనములో ప్రతిపాదితమయిన విషయము బట్టి విరోధాభాసాలంకారరూపముగ నిర్ధారితమయినది. పరవనితా ముఖ విలోకన

విధియందు బసవేశ్వరుడు జాత్యంధుడని దీని యర్థము. మహా కవుల వర్ణనము లిట్లేయుండును. బసవేశ్వరుని పరవనితా విముఖత్వమును సామాన్యకవులింత దృఢతరముగ నిరూపింపజాలరు. పరధనమువల్లగూడ నిట్లె బసవడెంతయు విముఖుడు, విరక్తుడు నని ముందే చెప్పియుంటిని. అది యతనికి విషతుల్యము. బసవేశ్వరుని నిత్య జంగమారాధనముల కాతనికి ధనమెట్లు చేకూరుచున్నదని శంకించి, తోడిమంత్రు లాతడు రాజభాండాగారమునందలి సొమ్మునే విచ్చలవిడిగా వెచ్చించుచున్నా డని, బిజ్జలునకు కొండెములు చెప్పుటయు, రాజావారాతనిని కోశాగారమందలి ధనమును పలుమారులు లెక్క వేయించి చూడగ తఱుగేమియుగానరాక, పయిగా లెక్కకెక్కువగ నుండుటయు గాంచి లజ్జించి చాడీకోరులను శిక్షించుటయు మున్నగు కథలు బసవ పురాణాదికముల వలన తెలియనగును. బసవనికి బిజ్జలుడొసంగు వేతనమువల్లనే యీతడీ జంగమారాధనములు నిర్వహింపగల్గెనా యని కొందఱు శంకింపవచ్చును. నిక్క మాలోచించిన బిజ్జలుని బొక్కసమందలి రొక్కము మాత్ర మిందుకు సరిపోవునా? అనన్యశరణ్య బుద్ధితో సంగమేశ్వరుని నమ్మియుండిన మహాభక్తున కసాధ్య మేముండును? ఇందుకు వలసిన ధనమొసంగునది సంగమేశ్వరుడే! జంగమముఖమున దాని నారగించునదియు నాతడే! ఒడయలధనము చే నొడయలకొసంగితి నని హాజరుజవాబుగా బసవ డొసగెడి సమాధానమందలి పరమార్థమిదియే. బసవని శీలమునకు మెఱవడి కూర్చిన గుణ గణ

ములఁగూర్చి యిట్టులెంతయేని చెప్పఁదగును. ఇట్టి మహాపురుషుల స్మరణార్థముగ నిట్టి జయంతు లొనర్చుటవలని ప్రయోజనము వారి వర్తనముల నాదర్శములుగ మనమున నిడుకొని కొంతవఱకయిన వానిని మన మనుసరింపఁ గలుగు నాఁడే నెఱవేఱును

కావుననే, "మనియుండెడి జనమెల్లను, చనిపోయిన వారి దివ్య సత్కథ లెలమిఁ, వినవలె గనవలె మనవలె, ననిమిషులకు నైనఁదెలియ దంత్యము వేమా!" అని వేమనయోగి హెచ్చరించినాడు. కావున వీరశైవ సోదరులెల్ల బసవని గుణగణ కీర్తనముతో తృప్తిపడక వానిని తమ వర్తనములకు వరవడిగ గ్రహించి యాచరించు నాఁడే చరితార్థత నొందగలరని మనవి చేయుచున్నాను.

---

## బసవేశ్వరుఁడు.

ఉ॥ మండగి వంశభూషణుఁడు మాదయ; తత్సతి మాదమాంబ, బ్ర
హ్మాండ వికీర్ణ గీతయశు, నంబుజలోచన ముఖ్యదేవతా
మండలసేవ్య ధీరగుణమండితు, శ్రీ బసవేశ్వరాఖ్యు, నే
దండితపంబు మైఁగనిరొ ధన్యతఁగాంచి నిజైకపుత్త్రుఁగాఁ.

సీ॥ వసదసందోహంబు వదన నీలిమగాఁగ
నంబుజవైరిస్కంధంబుగాఁగ
భూసభోమధ్యంబు ముఖవివరముగాఁగ
స్వర్లోకవాహిని సాస్నగాఁగ

శరసిధుల్ నాలుగు ఖురపుటంబులుగాఁగ
సప్తరాట్ వాలహస్తంబుగాఁగ
తారకాగణములు ద్యుతికింకిణులుగాఁగ
నగకుటీంద్రములు విషాణములుగాఁగ

గీ॥ సృష్టికెల్లను నాదిమసృష్టియగుచు
నవతరించిన యాదివృషాధిపతియె
ధర్మ సంస్థాపనమొనర్ప ధరణియందు
బసవఁడయి జనియించె సర్వజ్ఞునాజ్ఞ.

సీ॥ ఫాలాక్షభక్తకల్పక మెవ్వఁడనినపేఁ
డను జిహ్వకు నమృతమైనవాఁడు
భక్తసీమంతినీవరుఁ డెవ్వఁడనినపేఁ
డని చూపుటకు లక్ష్యమైనవాఁడు
అకలంకధర్మరక్షకు డెవ్వఁడనినపేఁ
డని యెన్నుటకు నాద్యుఁడైనవాఁడు
సర్వజ్ఞమూర్తి నాఁ జను నెవ్వఁడనినపేఁ
డను పలుకునకు మూర్తియైనవాఁడు

గీ॥ బిజ్జలక్ష్మాతలాధిపోద్వేలరాజ్య
రక్షణాదక్షుఁడపరఫాలేక్షణుండు
భరతజనయిత్రిసల్పిన వ్రతము ఫలము
ప్రథితగుణహారి మాదయ బసవశౌరి.

సీ॥ ఉరురాష్ట్రసచివుఁడై యుద్ధతిఁ జూపకే
పరమతాప్తి గావించినాఁడు
లింగాంగులనుగాంచి యంగజహరులని
యెంచిసద్భక్తిఁ బూజించినాఁడు
గురుఁడు శ్రీసంగమేశ్వరుఁడొనర్చిన బోధ
లెల్ల నులీలఁ బాలించినాఁడు
ప్రతివాదిచయమును ద్భటవివాదములజ
యించియశశ్రీ వరించినాఁడు

గీ॥ జనులు వెఱఁగంద సంగమేశ్వరునిగుడికి
నేఁగియాదివ్యమూర్తిఁ బల్కించినాఁడు
మాటికిదన శివాంశంబుఁ జాటినాఁడు
మనుజమాత్రుండె బసవ నామాత్యవరుఁడు.

గీ॥ ప్రమథవర్గపురోగతవర్తి! బసవ!
వైరిగణభయంకర సమవర్తి! బసవ!
భక్తజనలోకహృదయానువర్తి! బసవ!
భక్తిసామ్రాజ్యవరచక్రవర్తి! బసవ!

ఉ॥ భక్తియెజ్ఞానసాధనము, భక్తియె మోక్షరమాలవాలముల్
భక్తులెరుద్రమూర్తులిల, భక్తులయుంద వసించు లోకముల్
భక్తులఁగొల్వఁదత్ఫలము భర్గునెచెందునటంచునెంచు నీ
ప్రాక్తన జన్మవాసనల ప్రాభవముంగణుతింప శక్యమే?

చ॥ కలియుగమందు సంఘమున కన్నను మిన్నగు శక్తి లేదు, భ
క్తులయెడ జాతిభేదమును జూపుట దోషమటందు, వీరదీ
క్షులగఁ జేసి ప్రేమమున సర్వసమత్వపు సృష్టి నెన్ని జా
తుల ప్రాకటనెంచు నీ పరమ స్ఫూర్తిని పాలిట శంకయున్నదే!

కం॥ పరువంబు, కలిమి, దొరతన
మరయంగా వీరశైవ వ్యాప్తికె పొసఁగెన్
వరబసవవిభునకు; మహా
పురుషులసిరి యెల్లలోక భూత్యర్థముగా.

మ॥ ప్రణవోచ్చారణ కన్న మిన్నయగు శ్రీపంచాక్షరీమంత్రమున్
మనసంబున్ బొనరించు భక్తతతికిన్ మంత్రేతరంబుల్ జపిం
పను గాదంచును బల్కి పెక్కులు శ్రుతిప్రామాణ్యముల్ చూపి, గ్ర
క్కున గాయత్రిఁ ద్యజించినట్టిఘను సంస్కర్తం బ్రశంసించెదన్

మ॥ బసవాయంచొకమాటు పల్క మదియున్ బ్రాక్సంచితా
ఘౌఘముల్
బసవాయంచును రెండుమార్లనుడువన్ భక్త్యుద్భవంబయ్యెడిన్
బసవాయంచును మూఁడుమారులనఁ గైవల్యంబు సిద్ధించెడిన్
బసవప్రాకటశబ్దగౌరవము సంభావింప సామాన్యమే.

సీ॥ బసవశబ్దముగల్గెఁ బశుపశబ్దమునుండి
యుల్లాట నద్ది లింగాత్మకంబు
బ॰ యనంతపరశివ బ్రహ్మంబుగావున
పరయఁగా నద్ది శివాత్మకంబు
స, శివుశ్రియాకార సంపదగావున
నరయుగా నద్ది గుర్వాత్మకంబు
వ, పరమేశ్వరవచోవాసన గావున
నరయుగా నద్ది మంత్రాత్మకంబు

గీ॥ బసవ యనునక్షరములు మూఁడ సమలీల
దేవ దేవపరములై నుతింపఁబడును
గానవానిని జపియించుమానవుండు
శ్రీషడక్షరీ జపఫల శ్రీని జెందు.

చ. అతివయొకర్తు పంకతలమందునఁ బోవుచుఁ గాలుజాఱుటన్
పతనము చెందఁబోయి బసవాయనిపల్కిన భక్తపాలనా
రతి నెసఁ దోఁచిచే యొసఁగి రక్షణమిచ్చితివంట, పంకదు
ష్పతితుని నన్ను "పాహి బసవా"యను సీశరణార్థిఁ బ్రోవవే.

---

♦ గీ॥ ద్వాదశాక్షరి బసవసంబంధివోలె
సతతమీపద్యమాలిక జపమొనర్చు
భక్తజనములు శివుకృపా వైభవమునఁ
జెందెదరుగాత సచ్చిదానంద పదము.

గీ॥ నాఁడు పాలకురికి సోమనాథసుకవి
శంకరసముండు శత్రు భయంకరుండు
అనుపమంబుగ నీస్తుతు లాచరింప
నొసఁగినాఁడవు పరమ సాయుజ్యపదవి.

గీ॥ ఎంతచెట్టున కంతసమీరమనెడు
రీతి నల్పవాగ్విభవ సమేతుఁడయ్యు
భక్త బండారు తమ్మయామాత్యుఁడు నేఁడు
జన్మముతరింప నీదు సంస్తవమొనర్చెఁ.

గీ॥ సాంబుభక్తుల వర్ణభేదంబు గనని
ధన్యునకును విజ్ఞాజ్ఞభేదంబు లున్నె
కాన యతనిపైఁగూడ నీకరుణఁ జూపి
పూజ్య సోమునియట్టుల బ్రోవు బసవ !

♦ బసవద్వాదశాక్షరి:—"బసవ నమశ్శివాయ అ,ఉ,మ, ఓం"

---

# కల్యాణపురీ ప్రశంస.

[1955 జనవరినెలలో "బసవ కల్యాణక్షేత్ర"మున జరిగిన పదునాఱవ అఖిలభారత వీరశైవమహాసభా సందర్భమున రచింపఁబడినవి.]

శా॥ కల్యాణాఖ్యపురంబ! పశ్చిమచళుక్యాధీశసంస్థానమై
కల్యాణాత్మకుఁడై సమస్తజగతీ కల్యాణసంధాయ ధీ
కుల్యాశ్రేణుల నోలలాడు బసవాఖ్యుం డిచ్చు సాన్నిధ్య సా
కల్యంబందుచు ధన్యవయ్యు నిటు దుష్కాల ప్రభావంపు నై
కల్యంబందిన నిన్ను నేఁడు గనుల౯ గాంచంగఁ గట్టా! మన
శ్శల్యంబౌ చది కూర్పకున్నె భరమౌ సంతాప మెవ్వారికి౯.

ఉ॥ భారతభూమియందు నలువైపులనుండియు జ్ఞానవృద్ధులిం
పారఁగ నిందుఁ జేరుచును నాత్మశివానుభవంబు లెల్లవె
ల్వారఁగ గేయరూపముల వర్ధిలఁ జేసిరటంచు వింటిమా
ధీరులదివ్యసన్నిధిని దేజమునొందిన నీదుభాగ్యమే
తీరునఁ గల్గ నేర్చుమతి దేనికినైనఁ బురీవతంసమా !

శా॥ తల్లీ! నీదగుపూర్వవైభవము చిత్తంబందు ధ్యానించు నే
యుల్లంబూఱటనొందుసాధనముగా నూహింతు మేమింక నీ
తొల్లింటున్నతి నేఁడు లేశమయిన౯ దోఁపంగ రానీక త్రా
నెల్ల౯ మాయఁగఁ జేసినట్టివిధినే నేరీతి దూఱందగు౯.

సీ॥ మొడవాలు, బజ్జలు మత్తకరిమదమ్ము

నడఁగించి చెండాడినట్టిచోటు

గేయచారిత్రుఁడౌ గిన్నరబ్రహ్మన్న

కభవుఁడో యని పల్కినట్టినెలవు

పరవాదులు భజింప బసవయ్య శివనాగ

మయగోని యూరేఁగినట్టిరథ్య

అల్లమప్రభునకు నర్మిలి బసవేశుఁ

డాత్మార్పణమునర్చినట్టి వసతి

గీ॥ ఎంతో దూరంబునుండి యేతెంచినట్టి

మమ్ముఁ గరుణించి కడునాదరమ్ముతోడఁ

జూపఁగదవమ్మ! మేము విశుద్ధులమయి

జన్మముతరింప నిండ్లకుఁ జనకముస్న.

ఉ॥ అనుపమభక్తియుక్తి బసవాఖ్యుఁడు మున్నిటమూఁడుప్రొద్దులం

దనుదినముల్ మహాప్రమథులట్టులుగూడెదు భక్తకోటులయ

ర్చనముల వేడ్కఁజేసిన తెఱంగు నొకించుక తెల్పనో యనల్

ఘనమతినిందుఁగూడినగణంబులకంజలిగూర్చి మ్రొక్కెదన్.

చ. బసవనితోడ మున్న తని పజ్జనునిందువసించి సత్క్రియా

వసరములందు నాతనికి బాసటయామచను జిత్సుఖాబ్ధి, వె

క్కసముగ మగ్నులై గణనగాంచినమాచయబ్రహ్మయాదులన్

అసమగుణాఢ్యులన్ దలఁతునందఱ నేఁడిటఁ జిత్సుఖార్థినై.

---

బసవకల్యాణమందలి భక్తికలన నేఁడచటఁ గూడు షోడశ సఖిల తీయవీరశైవసభాంగ దివ్యసన్నివేశమందున భక్తిసం వేశమునను ఆపురీవిభవప్రశంసాత్మకముగ భక్తబండారుతమ్మయామాహ్వాయుడు గూర్చు పద్యషట్కంబిదియుభవ్యభవ్యకరుణవఱలుఁ గావుత శివభక్త వర్గములను.

# అష్టమ ఆంధ్ర రాష్ట్ర
# వీరశైవ జంగమ మహాసభ, నెల్లూరు

శ్రీ టి. హెచ్. ఎం. సదాశివయ్య ఎం. ఎ. బి. ఎల్ గారి

అధ్యక్షభాషణము

# వీరశైవ దర్శనము—దాని పుట్టు పూర్వోత్తరములు

శివస్వరూప శరణబృందమునకు శరణు శరణార్థి

"సంగముచేఁ గాని అగ్ని పుట్టదు
సంగముచేఁ గాని బీజమంకురింపదు
సంగముచేఁ గాని సర్వసుఖ మబ్బదు
చెన్న మల్లికార్జున దేవయ్యా !
మీ శరణుల అనుభావ సంగము వల్ల నేను పరమసుఖి నైతిని.

అని మహాశివ శరణు రాలు అక్క మహాదేవి శివాను భవగోష్ఠిని గుఱించి యుద్ఘోషించి యున్నది. ఇది యిప్పటికి 800 వందల సంవత్సరముల క్రిందటి సంగతి. ఆ సువర్ణయుగము నందు విశాల భారతవర్షపు నానాభాగముల నుండిన శరణులు ధర్మ కేంద్రమైన కల్యాణ కటకమునందు స్థాపింపఁబడియుండిన "శివానుభవ" మంటపమున సమావేశులై, ధర్మమునకు, తత్త్వమునకు సమాజమునకు నీతి రీతులకు సంబంధించిన ప్రశ్నలను చర్చించి వానిని తమ అనుభవమను కొలమానమున గొలిచి నిర్ణయములను చేయుచు, ఆనిర్ణయములను అమృతకణ

తుల్యము లగు వచనముల రూపమున సమాజమునందు ప్రచారము గావించి మహోత్తమమైన విచారక్రాంతి దీప్తిని వెలిగించినారు. ఆ క్రాంతి ఫలముగ జడమయమై యుండిన సమాజము చైతన్య కళాన్వాన పూర్ణమైనది. శక్తిమంతమైనది. సర్వాంగసుందరమైనది. ఆ శివానుభవ మండపగోష్ఠియందు.

ఆంధ్రదేశపు శివశరణులు శరణు రాండ్రు

సహా పాల్గొని, ఆ విచారక్రాంతి జ్యోతిని ఆంధ్ర మండలమునందెల్లెడ ప్రజ్వలింపఁజేసిరని వచన వాఙ్మయేతిహాసము నుండి తెలియనగును. ఈ శుభసమయమునందు ఆ ధర్మ వీరుల దివ్యనామములను స్మరించుట యుక్తము. వారిలో ముఖ్యులు కల్లికుర్తి మల్లరసు, నకలేశ మాదరసు, బెజవాడ శ్రీపతి పండితారాధ్యులు, శివలెంక మంచనపండితారాధ్యులు, వేమనారాధ్యులు, పోరండ్ల సూరసానమ్మ, తెలుంగు జొమ్మయ్య, టంగుటూరి మారయ్య, లింగంపల్లి తెలుగేశ మసణయ్య, కోటగిరి బహురూపి చోడయ్య,భీమావతి, మైథున రామయ్య, కదిరి రెమ్మవ్వ, కెమ్మవ్వ, అగ్గలదేవి మున్నగువారు. వారి యుజ్జ్వల పరంపర ననుసరించి ఆంధ్రరాష్ట్ర వీరశైవ జంగమ సంఘము వారు మన సమాజము నెదుర్కొని యున్న సమస్యలను జర్చించుటకుఁగాను,ప్రతియేట ఆంధ్రరాష్ట్రపు కేంద్రస్థానములందు . మహాసభలను జరుపుచు సమాజాభ్యుదయమునకు కృషిచేయుచుండుట అభినందనీయము. నేను జన్మతః ఆంధ్ర దేశీయుఁడను గాను. నా మాతృభాష కన్నడము. అయినను

రాష్ట్రసంఘము వారు నాయందలి అభిమానమున నీ మహా సభకు నన్ను అధ్యక్షునిగా నియోగించి గౌరవించినారు. వారికి నాకృతజ్ఞతాపూర్వకమైన వందనములు. ఇప్పుడు మన ముందు నది యుగసంధియగు.

## స్పుట్నిక్ యుగము

మనము అత్యద్భుత క్రాంతికారకమైన నూతన యుగము నందు ప్రవేశించుచున్నాము. మానవకల్పితములైన సరిహద్దులు మాయమగుచున్నవి. సమాజవ్యవస్థయందు నెప్పుడు కని విని యెఱుంగని మార్పులు గలుగుచున్నవి. బూజుపట్టిన మన సత్త్వములు పటాపంచలగుచున్నవి. మానవుడు యుగ యుగముల నుండి తన్ని భూవలయమునకు బంధించియుండు ఆకర్షణశక్తిని ప్రతిఘటించి, రోదసీకుహరములదూరి, కోటాను కోట్లు మైళ్ళ దూరమున నుండు గ్రహమండలములకు వలసపోవు ప్రయత్నములు చేయుచున్న యీ క్రాంతి యుగమునందు ఇదివఱకు రూఢిగా వచ్చిన సంప్రదాయములు, సిద్ధాంతములు మార్పు నొందుట సహజము. ఆ మార్పుల నన్వయించి తమ జీవనక్రమమును సంస్కరించుకొనుట యెల్లరకు కర్తవ్యము. మన వీరశైవ ధర్మము కూడ నవోదయ యుగమునందే జన్మమెత్తినది. కనుక సాంప్రదాయక యుగధర్మమును మన జీవన మార్గమునందు సమన్వయము చేసికొనుట మనకు కష్టసాధ్యము కాదు. అయినను

వీరశైవదర్శనము యొక్క నిజస్వరూపము
మాత్రము మనకు సాక్షాత్కారము కావలెను.
రవీంద్రనాథ కవి సార్వభౌముడు చెప్పినట్లు

"Every religion that begins as a liberating agency ends as a vast prison house" జీవుని స్వాతంత్ర్యమును సాధించుటకయి పుట్టిన ప్రతి ధర్మము కట్ట చివర కొక విశాలకారాగృహముగా పరిణమించుచున్నది. వీరశైవము ఒక విశిష్టజాతి కాదు. ప్రత్యేకమైన కులము కాదు. అది విశ్వకల్యాణపథమును జూపుటకై గాను ఏర్పడిన యొక మతము. "సకలజీవరాసులకు శ్రేయమును గోరువారే కులజు" లని యుద్ఘోషించునట్టి యొక పంథ. అల్పక్రియల వలన బహుఫలములిచ్చు నొక భవ్యజీవన మార్గము. ఈపథమునకు వర్ణాశ్రమముల అవరోధములు లేవు. వ్రతనియమోపవాసముల జంజడములు లేవు. సులభమైన మోక్షమార్గము, సరళ జీవనము, కాయకము యొక్క మహత్త్వము మున్నగు వానిని బోధించుటయే గాక వానిని సాధించుటకు, సులభమైన మార్గమును జూపుటయే దీని ప్రధానలక్ష్యము. ఈ ధర్మమునందు అష్టావరణములు క్రియాప్రధానముగను, పంచాచారములు నీతి ప్రధానముగను, షట్స్థలములు తత్త్వ ప్రధానముగను నున్నవి. ఈ ధర్మము నవలంబించు వారికి "కాయకమే కైలాసము" "ఈ లోకమునందు చెల్లువారే పరలోకమునందును చెల్లెదరను" "దయాగుణమే ధర్మము యొక్క మూలము" "అయ్యా అ"

టయే స్వర్గము. ఒకరే యనుటయే నరకము. సత్యమాడునదే దేవలోకము. దేవలోక మర్త్యలోకములనునవి వేఱు కావు'' ఇది స్వర్గసుఖములకై యవకతవకలు పడునట్టి ధర్మము గాదు. స్వర్గమునకు నిచ్చెన వేయుటకు బదులు స్వర్గమునే భూలోకమునకు దింపునట్టి సాధన ప్రక్రియ. ఈధర్మము యొక్క మహాద్వారము జాతి-గీతి, మతము-గితము, లింగము-గింగము. ఇట్టి భేదములు లేక యందఱకు తెఱవఁబడియున్నది ''వీరశైవ ధర్మశిరోమణి'' కారుఁడుద్ఘోషించినట్లు ''సాధుష్వ పిచపాపేషు దుర్జనే సుజనే పిచ స్వమతే విమతే మూర్ఖే పరార్థే చాపకర్తరి సర్వత్ర భావయేదేకం వీరశైవస్య చోచ్యతే''

''సాధువును, పాపిని, దుర్జనుని, సుజనుని, స్వమతస్థుని, పరమతస్థుని, మూర్ఖుని, స్వార్థపరుని సర్వులను నేక భావముతో చూచునదియే వీరశైవము. ఇట్టి మహోన్నత భావములు గల్గియున్న యీ మతమునందు ఏకదేవోపాసన, ఏకభావము, సత్యము, అహింస, లింగాంగసామరస్యమనెడి నిష్కామకర్మ, స్త్రీని ప్రత్యక్ష మహాదేవిగా భావించి యామెకు మంత్రపురశ్చరణ, లింగదీక్షాది ద్విజధర్మముల ననుగ్రహించు మనస్తత్త్వము మున్నగునవి ఈధర్మము యొక్క విశిష్టలక్షణములు. ఈపథము నవలంబించిన వారిని గుఱించి యొకానొక పండితుఁడిట్లు చెప్పినాఁడు.

"The Lingayat community is a society of pr actical philosophers,a community of transcendenta

mystics, a university of spiritual fellowship and above all a commonwealh of free sonls with God as Lord, protector''

సుప్రసిద్ధ విదుషీమణి సరోజినీదేవి యీ ధర్మమునందిమిడియున్న సర్వసౌహార్ద్రభావాద్యుదాత్తతత్త్వములను గమనించి, వీరశైవ ధర్మము విశ్వధర్మముగా నుండుటకు తగినదియని ఘోషించియున్నది. సాంప్రతయుగ ప్రవర్తకుడు మహాత్మ గాంధి బసవేశ్వరుని తత్త్వములను తన యాదర్శములుగా గ్రహించినారు.

## శక్తి విశిష్టమైన శివాద్వైతమే

వీరశైవతత్త్వము. ఇటీవల సృష్టింపబడిన ''శ్రీకరభాష్య'' మనుకృత్రిమ గ్రంథములో ప్రతిపాదింపబడిన ''భేదాభేద తత్త్వ''మునకు, శక్తి విశిష్టాద్వైతమునకు సంబంధమే లేదు. వీరశైవ దర్శనము రీత్యా ''స్థల'' మను సాంకేతిక శబ్దముతో వ్యవహరింపబడుచున్న పరబ్రహ్మమను వస్తువు ''ఏకమేవాద్వితీయం బ్రహ్మ'' అను సూత్రము రీత్యా ఒకటియై, తానే తానుగా నుండి యావస్తువులో నున్న విమర్శ శక్తి పరిభావమున నది యేకకాలమున నుపాస్యము నుపాసకము నైనది. లింగస్థలము అంగస్థలమునని రెండు విధములుగా విభాగమైనది. స్థలములో నిమిడియుండిన శక్తి సహా రెండు భాగములై లింగస్థలమునందు ''కలా''రూపముగను, అంగస్థలమునందు ''భక్తి''రూపముగ నుపరిణమించినది. కల, ప్రవృత్తిపరము. భక్తి నివృత్తిపరము. ఈ రెంటి నడుమ నిరంతరము పోరాటము జరుగు

చునే యుండును. ఆ పోరాటమునందు చివరకు అంగస్థలపు భక్తికే విజయము లభించును. ఈ దృష్టిచే, ప్రవృత్తి పరమైన శివుని స్వభావము కంటె నివృత్తిపరమైన జీవుని భక్తియే యధికమయినదనుట శివానుభవ సూత్రముయొక్క మర్మము. అందుకే గాను శివుని కంటె భక్తులే యధికులని శాసనప్రసిద్ధులయిన శ్రీపతి పండితులుగూడనుద్ఘోషించినారు. బసవేశ్వరుఁడు "కెడపెడనను నది దేవుని ప్రతిన, గెలిచెదననునది భక్తుని ప్రతిన, చివరకు సత్యమను నిశితాయుధము వలన భక్తుఁడే గెలుచు"నని వీరోద్గారము గావించినాఁడు. ఈరీతి శివుని ప్రవృత్తి మార్గమును ప్రతిఘటించి విజయమునొందు వీరభక్తుఁడే వీరశైవుఁడు. శక్తి పరశివబ్రహ్మమునందు అవినాభావముగ స్వతస్సిద్ధముగ నున్న విశేషణము. ఇట్టి విశేషణాత్మక శక్తితో పరబ్రహ్మ సహజముగనే విశిష్టుఁడయి యున్నాఁడు. శక్తిరూపకమయిన యిట్టి యవినాభావవిశేషణముతోగూడియున్న బ్రహ్మముయొక్క తత్త్వమును ప్రతిపాదించుటయే శక్తి విశిష్టాద్వైతసిద్ధాంతమందలి రహస్యము. దీనిలో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాది సర్వతత్త్వములుసమన్వయింపఁబడినవి. ఈశక్తితత్త్వమును (Theory of Energy) Albert Einstein, Haldane, Arthur Erington. Crompton మున్నగు ఆధునిక విజ్ఞానవేత్తలుగూడ సంగీకరించినారు.

ఈభవ్యదర్శనము మానవ జీవన వ్యాపారమున ప్రకృతిపురుషులందు మీళనము గల్గించును. కావున, ఐహిక జన్మము

మాయ కాదు. పవిత్రమైన సత్యము. ఇష్ట లింగోపాసన వలన మానవజీవనము దివ్యజీవనమగును. ఆదిభౌతికశక్తులను ఆధ్యాత్మికముగా ప్రవర్తించునట్లు చేయును. అంగకరణములను లింగకరణములుగా రూపాంతరముచేయును. ఈ రీతిగా వీరశైవమునందు తత్త్వదర్శనము, క్రియాచరణము, అర్థాత్, జ్ఞాన, భక్తి క్రియల సత్యసుందర సమన్వయమున్నది.

కాశ్మీర శైవసిద్ధాంతమురీత్యా పరబ్రహ్మవస్తువు "పరా సంవిత్" అను పదమున నిరూపింపఁబడినది. శుద్ధమైన, సహజమైనజ్ఞానము "పరాసంవిత్" అనఁబడును. ఈజ్ఞానము అత్యంతత్వరితగతి గమనముగలది. చక్రాకారముగ చలించుచున్నది. చలనమెప్పుడు వర్తులమందేయుండును. ఆ జ్ఞానచక్రమునకు ఒక కేంద్రమును నొక పరిమితియు నుండవలెను. వర్తులమునడుమ వర్తులములు చక్రముల నడుమ చక్రములు నుండును. జ్ఞానము యొక్క ప్రతిఅవస్థకు ఒక కేంద్ర ముండియేతీఱవలెను. కేంద్రము స్థిరముగాను పరిధి చైతన్యాత్మకముగాను నుండును. వీరశైవ సిద్ధాంతమురీత్యా కేంద్రమునకు "స్థలము" "శివ" "లింగము" మున్నగు సాంకేతికనామము లున్నవి. పరిధికు కలా, శక్తి, అథవా, జంగమము మున్నగు నామములుగలవు. ఈ దృష్టిని శివుఁడను కేవల శాంతి, శక్తియను కేవలసమరమునుండి భిన్నమైనదిగాదు. అఖండగతి, అఖండస్థితి యనునవి మూలతః ఒకే వస్తువు. శివశక్తుల శాంతి సమరముల స్థితిగతుల యీ అవినాభావ సంబంధమే శక్తివిశిష్టాద్వైతము. స్థూలజ్ఞానము యొక్క

కేంద్రము ఇష్టలింగము. సూక్ష్మజ్ఞానముయొక్క కేంద్రము ప్రాణలింగము. కారణజ్ఞానముయొక్క కేంద్రము భావలింగము. స్థూల సూక్ష్మకారణముల కతీతమైన తురీయ జ్ఞానముయొక్క కేంద్రమే మహాలింగము. ఈమహాలింగము మనోమయ క్షేత్రమునకు దిగినయెడల భావలింగముగాను, ప్రాణమయ క్షేత్రమునకు దిగినయెడల ప్రాణలింగముగాను, భౌతికక్షేత్రమునకుదిగిన ఇష్టలింగముగాను పరిణామము పొందును. బ్రహ్మవిద్యా భావయందు చెప్పినట్లు ఒకటి మూడు అయి, మూడు ఆఱగుటచే షట్చక్ర అర్థాత్ షల్లింగతత్త్వము

శక్త్యభిన్నుఁడైన పరశివుఁడే సృష్టిస్థిత్యాది పంచకృత్యములకు మూలకారణుఁడు. వైజ్ఞానికులు సహా "పదార్థము" "శక్తి" యివి రెండు సృష్టికి మూలములని చెప్పిరి. కాన ఏవస్తువు మిథ్య కాదు. ఏ వస్తువు నాశముచెందదు. వస్తువులు ఒక్కొకరూపమున కాలకాలమున పరివర్తనమొందునని చెప్పు వైజ్ఞానికుల విచార సరణి శివానుభవతత్త్వము నందును గానన గును. అద్వైత వేదాంతతత్త్వము శుద్ధబ్రహ్మమునకు మాయా సంబంధముఁగల్పించి, జగదుత్పత్తి స్థితిలయములకు కారణుండని చెప్పు మిథ్యా వాదమును శివానుభవము ఖండించుచున్నది. ఐహికాముష్మిక జీవనముల సుందర సమన్వయము శివానుభవతత్త్వమునందుఁ గాననగును. శివభక్తుని దృష్టియందు సర్వము లింగ మయము. అక్కమహాదేవి కావ్యవాణితో చెప్పవలె ననుచో, "నేలయందగపడని నిధివలె,ఫల మందడగిన రుచివలె,

శిలలో నవ్యక్తముగా నున్న సువర్ణమువలె, నువ్వులలో నుండు నూనెవలె, భావమున మఱుగుపడియుండు బ్రహ్మమైయున్న చెన్నమల్లికార్జునిని నెలవు నెవరు తెలియఁజాలరు."

మల్లికార్జున పండితారాధ్యుండు తనశివతత్త్వ సారము నందు "అతివాఙ్మన సవ్యాపారమైన నీనిజరూపము నే నెట్టిదని నిరూపింతు శివా" అని ప్రిప్రిథమున నే చెప్పియున్నాఁడు.

## శివ తత్త్వము.

అనుభవవేద్యము గాన దీనిని కేవలము వేదశాస్త్రా భ్యాసము వలన కనుఁగొనఁజాలము. అక్కమహాదేవి యొక సుందర వచనమున—

"వనమంతయు నీవే,
వనమందలి సురతరులెల్లయు నీవే,
తరులమధ్య తిరిగెడు ఖగమృగములన్నియు నీవె,
చెన్నమల్లికార్జునా సర్వభరితుఁడవె,
నీ ముఖము నాకుఁ జూపవే ?

అని ఆరాటము నొందినది, ఇటువంటి సర్వభరితదృష్టి గల శివానుభావికే శివ సాక్షాత్కారము సాధ్యము, అతడే సమస్త భూతములను తనయందును తన్ను సర్వ భూతములం దునుజూచి సమస్తభూతములందు తానే సమ్మిళితముగానున్న ట్లు తెలిసికొనును. ఆ యెఱుకను భావముగా మార్చి ఆ భావ మును జీవనానుభవములో దింపి అతి మానవుఁడగును. అటు

వంటి పూర్ణ యోగికి మోహ మెక్కడిది? శోక మెక్కడిది? యని ఈశోపనిషత్తు ఈవిధముగా ప్రశ్నించుచున్నది.

"యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యే వాను పశ్యతి
సర్వ భూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే"
"యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూద్విజానతః
తత్రికో మోహః క శ్శోక
ఏకత్వమనుపశ్యతః"

పూర్ణ యోగ సాధనమును ప్రతిపాదించిన అరవింద యోగి చెప్పినట్లు—

"గుడి గుండారములు, పురాణ శాస్త్రములు, క్రియా కార్యములు. వివిధ తత్త్వజ్ఞానములు, మానవకోటి నుద్ధరించుటకు శక్యము గాక ఓడిపోయినవి. అవి కేవలము బుద్ధిబలముమీద నిల్చికొని, ఆచారము, శుద్ధి, దర్శనము వీనికే ప్రాముఖ్యము నిచ్చి కార్యమును సాధించుటకు ప్రయత్నించినవి. కాని యవి అత్యంత మహాత్వమైన యొకవిషయమును మాత్రము సంపూర్ణముగ నలక్షించినవి. ఆత్మశుద్ధి, పరిపూర్ణత, శక్తి వీనిని విలక్షించలేదు." వీరశైవ ధర్మము వీనికి ప్రాముఖ్యమునిచ్చి తన గుఱిని సాధించినది.

వీరశైవము అనుభవ ప్రధాన మైనది. కాన, దాని యుద్గమమును వేదాగమములందుగాని శాస్త్రములందుఁగాని కనుఁగొనుటకు ప్రయత్నించుట అనవసరము. అది వైదికమా? తాంత్రికమా? వైదిక-తాంత్రికమా? లేక తాంత్రిక వైదికమా? యని చర్చించి దానికి హద్దులను గల్పింపఁజూచుట వ్యర్థమైనపని. బసవేశ్వరుఁడు వ్రాకుచ్చినట్లు—

"నాలుక నందిన రుచికి మనకు మనమే సాక్షి.
మాలకరినడిగియే మొగ్గ వికసించునా ?

మొగ్గ వికసించుట యొకరి యాజ్ఞవలన కాదు. అది తనలోనుండు సహజమైన ప్రకృతిసిద్ధమైన స్వాతంత్ర్యమువలన సమయానుసారము విరిసి తన సౌరభమును వెదజల్లును. అట్లె అనుభావి వికాసము పొందుటకు, వేదశాస్త్రముల యనుమతిని పొందనవసరములేదు. తాను పొందిన జ్ఞానమును తాను ప్రత్యక్షముగాఁజూచి యనుభవించిన యనుభావముతో సమన్వయముచేసికొని తన స్వతస్సిద్ధమైన విమర్శాశక్తిని, విచార స్వాతంత్ర్యము నుపయోగించి సమయ మెఱిగి నడుచును. ఆ నడిగడనమే వేదాగమోపనిషత్తులు, శాస్త్రములు, దర్శనములు, శివశరణుల వచనములు; అక్కమహాదేవి వేదశాస్త్రములకంటె అనుభవమునకు నడవడికి ప్రాముఖ్యమునిచ్చి

"వేదశాస్త్రము లెల్లను దంచి శోధించిన
మచ్చు తవుడు చూడుడీ,
వీనిని దగచనేల ?

అచ్చటచ్చట చలించి తిరుగుచున్న మనసును
బ్రేంచిన బట్టబయలు చెన్నమల్లికార్జునా!

యని వ్రాకుచ్చినది. అంతటితోనే శివశరణులు వేద మార్గ విరోధులని పలువురు భ్రమపడి యున్నారు. వారివాద మునంగీకరించిన యెడల "వేదము చెప్పిన దంతయు సత్యము కా"దనినుడివిన శంకరాచార్యులుసహా వేదబాహ్యులే యగుదురు. "బుద్ధిశాలి యైనవాడు వేద శాస్త్రముల నభ్యసించి, జ్ఞాన విజ్ఞానతత్పరుడయి యుండవలెను. స్వచ్ఛధాన్యము కోరువాడు పొట్టును పాఱవేయునట్లు జ్ఞానమునుకోరువాడు గ్రంథములనెల్ల విసర్జించవలె నని శాసించిన యుపనిషత్తు కూడ, వేద మార్గ విరోధి యనుట సమంజసమా?

శివశరణులు వేదములందలి జ్ఞానకాండమును తమ ధర్మమునందు సమన్వయము చేసికొని యున్నారు. దయయే శివ ధర్మముయొక్క మూలము. కాబట్టి హింసాత్మకమైన యజ్ఞయాగాదులను, తర్కమునకు నిలువలేని శుష్క కర్మకాండములను నిరసించినారు. అంతమాత్రముననే వారు వేద మార్గ విరోధులు కాజాలరు.

## వీరశైవ ధర్మోదయము.

ఏకాలమునందు? దీనినెవరు స్థాపించిరి? మున్నగుప్రశ్నలుద్భవించి యిటీవల ననేక శుష్కవాదములకుఁ గారణములై మన సమాజములో లేనిపోని కలకలము పుట్టించినవి, అందుకే కాబోలు పెద్దలు, నదుల మూలము, ఋషులమూలము నరయ

ప్రయత్నించరాదని చెప్పినారు. శైవ ధర్మము వేదాగమముల కంటె చాల సనాతనమైన దనునది నిర్వివాదాంశము. అయ్యది యే విశ్వముయొక్క మూలధర్మమని చెప్పిన నతిశయోక్తి కాదు. దీని యుద్గమము ఆర్య, ద్రావిడ యుగములను దాటి అత్యంత ప్రాచీన శిలాయుగమునకు గొనిపోవుచున్నది... మోహంజాదారో, హారప్పా సంశోధనలవలన ఇప్పటికి 5, 6 వేల సంవత్సరముల పూర్వమునందె, లింగధారణ, లింగపూజా పద్ధతుల ననుసరించు నొకానొక బహు.పురాతన జనాంగము భారతదేశమందేగాక తదితర దేశములందును నుండిరని తెల్లమగుచున్నది. ఆర్య-ద్రావిడ సంస్కృతి సమ్మిశ్రణకాలములో ఈ సనాతనధర్మమే పాశుపత శైవ ధర్మముగా రూపొంది, కేవల మానవమాత్రులే గాక దేవతలు, మహర్షులుకూడ నీ ధర్మము నవలంబించియుండిరని పురాణేతిహాసములు చెప్పుచున్నవి. ఆ యుగమునం దిది యత్యున్నతస్థానమం దుండెడిది. ఈ పాశుపత ధర్మముయొక్క అవాంతర భేదములే, లకులీశ పాశుపతము, కాలాముఖము, నాథసిద్ధిపథము, కాశ్మీరశైవము కాపాలికము, శాక్తేయము, అర్వాచీనమైన గోళకీసంప్రదాయము మున్నగునవి. వీనిలో కొన్ని పంథాలు బౌద్ధ మహాయాన సంపర్కమునకాబోలు వామమార్గమునుబట్టి యత్యంత హేయమైనపద్ధతుల నవలంబించినవి. క్రీ. శ. 10 నుండి, 12 వ శతాబ్దమువఱకు కాలాముఖశైవము, శైవసిద్ధాంతము. గోళకీ సంప్రదాయము కర్ణాటాంధ్రదేశములలో నత్యంతప్రబలస్థితిలో

నుండినవి. దేవాలయములు, మఠములు మున్నగు ధార్మిక సంస్థల కన్నిటికి కాలాముఖాచార్యులే స్థాన పతులుగా నుండి, సార్వభౌములను, రాజులను, మాండలికులను, తమ పాదా క్రాంతులుగా జేసికొనియుండిరి. 12వ శతాబ్దమునందు పశ్చిమ చాళుక్య సామ్రాజ్య రాజధాని యగు కల్యాణ పట్టణమున

వీరశైవ ధర్మ విప్లవము.

చెలరేగినది. అచిరకాలములోనే భారతవర్షము నంతట వ్యాపించినది. ఆ క్రాంతి ప్రవాహమున పైని నుదాహరింపఁబడిన సనాతనశైవధర్మము లన్నియు గతించిపోయినవి. కాలాముఖ, పాశుపత, గోళకీ సంప్రదాయ మఠము లన్నియు వీరశైవ మఠములుగా మారిపోయినవి. శైవధర్మము యొక్క యుత్క్రాంతియే వీరశైవము. ఈ యద్భుత విచార క్రాంతి పరిణామముగా వామాచారములు నశించి పోయినవి. దుర్నీతి భూయిష్ఠమైన తాంత్రిక కార్యములు త్యజింపఁబడినవి. సాత్త్విక నీతినియమములకు ప్రాధాన్యమివ్వఁబడినది. స్థావర లింగోపాసనమునకు బదులు అహంగ్రహోపాసనా చిహ్నమయిన ఇష్టలింగోపాసనము శైవులకు ముఖ్య విధిగా గ్రహింపఁబడినది. అంగము శివుని ప్రతీకమను భావముపోయి, లింగమనగా జీవాత్మనియందు సుప్తమైయున్న పరబ్రహ్మాంశమే యను తత్త్వముదయించి లింగాంగ సామరస్య సాధనము లయిన షట్స్థల సిద్ధాంతము, అష్టావరణ పంచాచారములు ప్రతిపాదింపఁబడినవి.

వీనిఛాయలు శైవాగమములందక్కడక్కడ చాలసూక్ష్మముగ నంకురరూపమున కనఁబడుచున్నను విస్తారముగ వీని నిజస్వరూపము కన్నడవచన సాహిత్యమునందును కరణహాసిగె, మంత్రగోప్య, మిశ్రార్పణ మున్నగు శివానుభవ శాస్త్రిములందును కానవగును. పదిమూడవ శతాబ్దమునందు వీరశైవ వేదవ్యాసుడనదగు పాల్కురికి సోమనాథుడు అసంఖ్యాక సంస్కృతాంధ్రగ్రంథములను రచించి ఈ సిద్ధాంతమును ఆంధ్ర దేశమునందంతట బ్రచారముచేసెను. 13 వ శతాబ్దపు అంత్యభాగమున శివయోగిశివాచార్యుఁడు ఈ షట్స్థలదర్శనమును క్రోడీకరించి సంస్కృతమున "సిద్ధాంత శిఖామణి" యను నొక యుద్గ్రంథము రచించి కర్ణాటకేతరులకు ఈ తత్త్వముయొక్క పరిచయము చేసెను. ఈదర్శనము ఆగమముల ఉత్తరభాగమునందు చేర్పఁబడియుండినందున వీరశైవము ఆగమాంతధర్మమని పేరు వడసెను. సుప్రసిద్ధుఁడయిన మగ్గెపూయి దేవుఁడు 15వ శతాబ్దమునందు "శివానుభవ సూత్రములు" "ఒకేశ్వార్థప్రకాశిక" అను సంస్కృత దర్శన గ్రంథములను రచించి షట్స్థల సిద్ధాంతమును ఆంధ్ర దేశము నంతట ప్రచారము గావించి ఆంధ్ర దేశపు ఆరాధ్యబ్రాహ్మణులకు నిత్య స్మరణీయులైన ద్వాదశాచార్యులందున్నతస్థానము నొందెను. మాయిదేవాచార్యుని యీ రెండు గ్రంథములు ఆరాధ్యుల "శాస్త్రి పంచకము" నందు చేర్పఁబడినవి. అతని "శివానుభవ సూత్రములు" వాతూలాగామోత్తర భాగమునందు గర్భీకృతములయినవి. ఈ మూడు

గ్రంథములతో పాటు "సిద్ధాంతశిఖామణి" మఱియు రమారమి అదే కాలమునందు రచింపబడిన స్కాందపురాణాంతర్గత "వీర మాహేశ్వర ప్రకరణము" ఆరాధ్యుల శాస్త్రపంచక మైనది.

ఐతిహాసిక, తాత్త్విక, వైజ్ఞానిక దృష్టిని బరిశీలించిన నీ ధర్మ మేయొక్క నిర్దిష్ట కాలమున గాని, ఏ యొక్క వ్యక్తివలన గాని సృష్టింపబడినదికాదు. మొగ్గనై సర్గికముగా కాలక్రమేణ వికసించి సర్వాంగసుందరమైన వృక్షమైనట్లు ఈ ధర్మము వికసించినది.

కేవలము శైవ ధర్మములనుండి గాక, స్మార్త, జైన బౌద్ధ ధర్మములందును సాంఖ్య యోగాది దర్శనము లందును నిమిడియున్న సత్య, శుద్ధ, నిత్య తత్త్వములను స్వీకరించి జీర్ణించికొనియున్న ఈ వీరశైవ ధర్మమును కొందఱు తత్త్వవేత్తలు (eclectic religion) సమన్వయధర్మ మనియు, ఆదర్శపంథ యనియు విశేషించియున్నారు. ఆనాటి పాశుపత, కాలాముఖాది శైవశాఖలన్నియు ఈ మహాప్రవాహమునందు లీనమైన విషయమును గుర్తించియే పాల్కురికి సోమనాథుఁడు తన "ఆంధ్ర బసవపురాణము" సప్తమాశ్వాసము నందు,

"దేవలకులు మంత్ర దీక్షాన్వితులును,
జైన పాశుపతాది శాసన ధరులు.
వారు వారిక లింగవంతులై కూడి,
వీరమాహేశ్వరాచార నిష్ఠాఢ్యులై,
భూరిప్రసాదోప భోగులై నడవ"

ఇట్లు ఏలీనకరణము గుఱించి చెప్పుచు నా కాలములో లింగధారి ధర్మమును స్వీకరించిన శ్రీకంఠ శివులు, గౌరీనాథ శివులు, లోకేశ శివులు మున్నగు కొందఱు గోళకీమత సంప్రదాయ శైవసిద్ధాంతాచార్యుల పేర్ల నుదాహరించినాఁడు. ఈ సంప్రదాయములో సుప్రసిద్ధుఁ డయిన...

విశ్వేశ్వర శివదేశికుడు.

13వ శతాబ్దమునందు విజృంభించిన సుప్రసిద్ధ కాకతీయాంధ్ర సార్వభౌముల దీక్షా గురువు. కాకతీయ సామ్రాజ్యమున కాధారస్తంభముగా నుండినవాడు. ఇతడా యుగమునందు దక్షిణాపథమునంతట చాల ప్రఖ్యాతినంది యుండెను. చోళ మాళవరాజా లీతని శిష్యులు, కలచురి కాకతీయరాజుల కీతఁడు దీక్షాగురువు. మహావిద్వాంసుఁడగుటచే నీతఁడు గణపతి సార్వభౌముని విద్యా మండపమున కధ్యక్షుఁడుగ నుండెను. ఈతఁడు సంస్కృతాంధ్ర కవితాపితామహుఁడని సుప్రసిద్ధినొంది యుండి "పురుషార్థసారము" "శివదేవధీమణిశతకము" "పరతత్త్వ రసాయనము" మున్నగు గ్రంథములను రచించెను. ఈతనికి శివదేవుండను వ్యవహారనామ ముండెనని "ప్రతాపచరిత్ర" "సిద్ధేశ్వరచరిత్ర" "సోమదేవ రాజీయము" మున్నగు స్థానిక చరిత్రముల వలనను శరభరాజ, నాగారాధ్య, నాగభూషణ కవుల కృతులవలనను తెలియుచున్నది. నాగారాధ్యనాగభూషణ కవులు రచించిన "బసవ విజయము" నందు ఈతఁడే కాకతీయసార్వభౌమునికి కల్యాణబసవేశ్వరుని మాహాత్మ్యమును

బోధించి రాజసన్మానమునొందెనని చెప్పబడియున్నది. ఇది కేవలము కవికల్పనమాత్రము గాదు. ఈ శివాచార్యునివీరశివశరణధర్మము అద్భుత పరిణామము గావించెనని యాతని కృతులవల్లను సుప్రసిద్ధమైన "మల్కాపుర" శాసనమువలనను తెలియనగును. ఆ శాసనము చివరిభాగమున...

"విశ్వేశ్వర శివాచార్యో ధీమాన్రాజగురుస్స్వయం
ఏవమాజ్ఞాపయద్వీర శైవాచార్యశ్శైర్యుతః"

రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యులు వీరశైవాచార్యులతో సమావేశమైయుండెనని చెప్పబడి యున్నది. ఈ శాసనము క్రీ.శ. 1261 మార్చినెలయందు పుట్టినది. నెల్లూరు పురజనులు ఈ రోజున అత్యుత్సాహముప జరుపుచున్న అగ్నిగుండ మహోత్సవపు పురవంతులు మల్కాపురశాసనమునందు "వీరభద్రు" లని యుల్లేఖింపబడినారు. వీరే "దశ గ్రామస్య రక్షకు"లని వర్ణింపబడియున్నారు. రమారమి యీ కాలమునందే పుట్టిన చోడదాన పుర శాసనమునందు యీ శివదేవుడు "బసవేశ్వరుని రెండవ అవతార" మని విశ్లేషింపబడి యున్నాడు. 12వ శతాబ్దపు ధార్మిక విప్లవమునందు వినాశమయి పోయిన కల్యాణ పట్టణము కాకతీయాంధ్ర యుగమునందు ఓరుగల్లు పట్టణమునందు పునరవతరించినదని నిస్సందేహముగ చెప్పవచ్చును. కాకతీయరాజులు వీరశైవ ధర్మానుయాయులే యని చరిత్రకారులు నిర్ణయించినారు. (See History of Telugu Litareture— by Chenchaiah and

Bhujangarao). వీరశైవ పంచాచార్యులలో నొకరయిన శ్రీమరుల సిద్ధ దేశికేంద్రులు గణపతి చక్రవర్తి కాలమున నోరుగల్లు పురమునకు విచ్చేసి యుండిరనియు, రాఘవాంకుడు పద్మరసు మున్నగు వీరశైవకవులు కాకతీయరాజసభయందు సన్మానము పొందినదియు గమనార్హములు. కాకతీయరాజులు "పరమ మాహేశ్వర శ్రీస్వయంభూదేవ శ్రీపాదపద్మా రాధకు''లను బిరుదముగలవారని శాసనముల వలన తెలియుచున్నది. 12వ శతాబ్దమునందు శైవశాఖలన్నియు వీరశైవమునందు విలీనమైనవి. ఈ విలీనకరణము 13-14 వ శతాబ్దములందు సంపూర్ణమైనది.

ఇక తాత్త్వికదృష్టిని నీ మతముయొక్క యుద్గమము కనుగొందము.

"చతుర్థం శివధర్మాఖ్యం సాక్షా న్నందీశ భాషితం" అని యొకఋషి. యీ ధర్మమును స్థాపించినయతడు నందీశ్వరుడేయని చెప్పినాడు. నందీశ్వరుడు ధర్మస్వరూపుడు. ప్రమథాధిపతి, గోత్రకర్త, నందిధ్వజము వీరశైవ ధర్మపతాకము. ఇతడే యనాది భక్తుడని శ్రీశైల ఖండమునుండి తెలియనగును. యోగజాగమము నందు...

"అనాది భక్త రూపేణ భగవాన్ పరమేశ్వరః
పంచాచారాంశ్చ షడ్రూపాణ్యష్టావరణానిచ
లింగాంగసామరస్యంచ ముక్తిమాహం జగద్గురుః"

అని పరశివుడే అనాదిభక్త రూపమున నీ మతమును

స్థాపించెనని చెప్పఁబడియున్నది. ఈ ధర్మమునందు భక్తున కెట్టి ప్రాశస్త్య మున్నదో యిదివఱకే చెప్పియున్నాను. కేవలము మానవులే గాక దేవతలు, దేవర్షులు, ప్రమథులుకూడ నివృత్తిమార్గమున పర వస్తువునం దైక్యము నొందవలెనన్న మానవశరీరముఁ ధరించి భక్తిస్థలము మొదలుగా ఆఱుసోపానము లవరోహింపవలె నని వీరశైవ మతీయుల నమ్మకము. ఐహికజన్మమునకు మానవ శరీరమునకు నంత ప్రాముఖ్యమివ్వఁబడినది. శివుఁడు నాతని ప్రమథ గణంబులు నివృత్తి మార్గము సాధించుటకుఁగాను భూలోకమునకు దిగి రావలసినదే. రేణుకాచార్యాది ప్రమథగణములు పరశివుని పంచ ముఖములం దుద్భవించి, నాలుగు యుగములందు వేర్వేఱు నామములతో భూలోకమునం దవతరించి ఈ ధర్మమును స్థాపించిరని చెప్పు స్వాయంభు వాగమము ఈ తత్త్వమునే ప్రతిపాదించుచున్నది. ఆ స్వాయంభు వాగమమే పరమాత్ముని శిఖా చక్రమునుండి అనాదిజంగమమూర్తి యుద్భవించి కృతయుగమునందు నిరంజనుఁ డనియు, త్రేతాయుగము నందు నిర్మాయుఁ డనియు, ద్వాపరమునందు నిష్కలుఁడనియు, కలియుగమునందు ప్రభుదేవుఁ డనియు నామములతో నవతరించి, పంచాచార్యులకు మార్గదర్శకుడై షట్స్థల సిద్ధాంతము స్థాపించె ననియు, అనాది భక్తుఁడైన నందీశ్వరుఁడు కృతయుగమునందు స్కందగణేశుడనియు త్రేతాయుగమునందు నీలలోహితు డనియు, ద్వాపరమునందు వృషభ గణేశుఁడనియు కలియుగమునందు బసవేశ్వ

రుఁడనియు అవతరించెనని చెప్పుచున్నది. ఓంకార స్వరూపుఁడగు షణ్ముఖుఁడే చెన్నబసవేశ్వరరూపమున నవతరించి షట్స్థల సిద్ధాంతమును స్థాపించెననియు, ఆ సిద్ధాంతమును రేణుకాచార్యులు అగస్త్యునికి బోధించెననియు అత్తలూరి పాపకవి చెన్న బసవపురాణమునందు ప్రతిపాదించినాఁడు. ఈమహావిభూతులు శివాంశ సంభూతులై మతప్రవర్తకులైనారు. కాన తాత్త్విక దృష్టిచే మానవునందవ్యక్తముగనున్న శివాంశమే వీరశైవ ధర్మోదయమునకు కారణము. శివుడే వీరశైవ మతస్థాపకుడు. ఈ సత్యమును గ్రహించి వీరశైవులు ఈ సమస్యపై నిటీవల పుట్టియున్న శుష్కవాదోపవాదములను నిరసించి సమాజైక్యమును సాధింతురుగాక!

ఇట్లు మహోజ్జ్వలముగా వెలసిన యీ వీరశైవధర్మము సాంప్రత యుగమున

కన్నడమునందేమి ఆంధ్రమండలమునందేమి యత్యంత శోచనీయస్థితి యందున్న సంగతి నిజముగా హృదయ విదారకమగుచున్నది. ఈ ధర్మముయొక్క నిజస్వరూపము నెఱుంగక కొందఱుపండితులు శివభక్తి తమోగుణప్రధానమైనదనియు, వీరశైవ వాఙ్మయము దుర్నీతి భూయిష్ఠమనియు నిరాఘాటముగఁ జెప్పుచున్నారు. ఇంక కొందఱు వీరశైవము ఆవేశపూరిత ధర్మమని చెప్పుచున్నారు.

ఇటువంటి యూహాపోహములకు గుఱియైనధర్మము వేఱొకటి లేదనియే చెప్పవచ్చును. ఆంధ్ర మండలమునందు వీరశైవుల

సంఖ్య క్రమక్రమముగా తగ్గిపోవుచున్నది. మిగిలియున్న స్వల్ప సంఖ్యాకులలో నజ్ఞానము, అవజ్ఞత, అనైకమత్యము ప్రబలు చున్నవి. "కాయకమే కైలాస"మని ఘోషించుచుండిన జంగములకు భిక్షాటనమే జీవనాధార మయినది. ఆంధ్ర రాష్ట్రీ జంగమసంఘమువారు ఈ భిక్షాటనవృత్తిని నిర్మూలము చేయు టకుగాను విశ్వప్రయత్నముచేయుచుండుట యెంతయో అభినం దనీయము. మన సమాజమున కిప్పు డతిముఖ్యముగా కావలసి యున్నది స్వధర్మ నిజ స్వరూప జ్ఞానము. అర్థాత్ స్వరూప జ్ఞానము. ఆ జ్ఞానమును సాధించుటకుగాను వీరశైవ సాహిత్య పరిచయము మనకు ముఖ్యముగా కావలయును.

## ఆంధ్ర వీరశైవ సాహిత్యము.

కన్నడ సాహిత్యమువలె నతి విశాలముగను, సర్వతో ముఖముగను, సర్వాంగ సుందరముగను నున్నది. ఈ ఉభయ సాహిత్యములు క్రాంతి యుగమునందు పుట్టినవి. వీని మూల మొక్కటియే. కర్ణాట కాంధ్రభాషా చరిత్రములందు వీరశైవ సాహిత్యమునకు ప్రత్యేకముగా విశిష్టమయిన ఉన్నతస్థాన మున్నది. ఉభయ భాషలందు సర్వ స్వాతంత్రమయిన జాతీయ మయిన జనతా సాహిత్యమును రచించినకీర్తి వీరశైవుల దే. ఈ ఉభయ సాహిత్యములకు నవినాభావ సంబంధ ముండియుండి కన్నడకవుల ప్రభావ మాంధ్రసాహిత్యమునందును, ఆంధ్రకవుల ప్రభావము కన్నడ సాహిత్యమునందును గానవగును. ఉభయ సాహిత్యముల సంపూర్ణ సాక్షాత్కార దివ్యదర్శనము కోరు వారు ఉభయభాషా పరిచయములు చేసికొనుట అత్యంతావ

శ్యకమని నా యభిప్రాయము. విశాలాంధ్ర వాఙ్మయము వలె వీరశైవాంధ్రవాఙ్మయముకూడ సర్వతోముఖముగనున్నది. వీరశైవగ్రంథములు శాఖోపశాఖలుగఁ బెఱిగి పురాణములు, మాహాత్మ్యములు, ప్రబంధములు, కీర్తనలు, యక్షగానములు, గేయములు, మున్నగు వివిధభాగములుగానున్నది. అయిన నేమి? ఆంధ్రవాఙ్మయేతిహాసములో వీరశైవవాఙ్మయము "అలేఖ్యాధ్యాయము" (Unwritten chapter) గానున్నది. ప్రఖ్యాతవిద్వాంసులైన కట్టమంచి రామలింగారెడ్డిగారు "It is the misfortune of the Telugus that for years they have lost sight of the Veerasaiva Literature and even to day they have not given it the importance and currency it deserves".

అని విషాదపూర్వకముగా చెప్పిన వాక్యములు అక్షరశః నిజము. మఱియు శ్రీరెడ్డిగారే శ్రీబండారు తమ్మయ్యగారు రచించిన "పాల్కురికిసోమనాథకవి" యను గ్రంథమునుగుఱించి ప్రశంసాపూర్వకముగనొసంగిన యభిప్రాయములో "It is by far the best book on one of our greatest poets, who for some reasons which may not be desirable to specify, has not received from the Telugu public and scholars the attention and respect due".
అని యుద్ఘోషించినారు.

## శ్రీ పండిత బండారు తమ్మయ్యగారు.

"విమర్శకాగ్రేసర" "ఐతిహాసికసమ్రాట్" "ధర్మభూషణ" "శివశరణ" మున్నగు బిరుదములతో గౌరవింపఁ

బడిన యొకమహావ్యక్తి. వారిపరిచయభాగ్యము నాకు 1935 సం॥ నుండి కలిగినది. నాసాహిత్యసంశోధనా కార్యమునకు దోహదమిచ్చిన మహనీయులెవరనిన శ్రీబండారు తమ్మయ్యగారు, కై. వా. మహామహోపాధ్యాయ, ముదిగొండ నాగలింగశాస్త్రి గారు, కై.వా. గంగపట్టణపు సుబ్రహ్మణ్యదేవరగారు. ఇటీవల ఆంధ్రసాహిత్యక్షేత్రమునందు వీరశైవమతముగురించి శివ కవులనుగురించి పుట్టిన యనేకములయినయపోహములను శ్రీత మ్మయ్యగారు సప్రమాణముగా ఖండించి వీర శైవసాహిత్య ముయొక్క కీర్తిని గౌరవమును కాపాడినారు. ఆంధ్రులకు వీర శైవధర్మసాహిత్యముల పరిచయము శ్రీతమ్మయ్యగారివలననే గల్గినదని చెప్పుట యతిశయోక్తిగాదు. ఆమహనీయులు ఆంధ్ర సాహిత్యమునకు, శైవసాహిత్యమునకు గావించిననిస్స్వార్థసేవ యమోఘమైనది. వారిప్పుడు వృద్ధులయియుండియు సాహిత్య సేవ నకుంఠితముగా జరుపుచుండుట మన భాగ్యవిశేషము. "స్వధర్మ" పత్రికా నిర్వాహణము నెట్టిప్రతిఫలాపేక్షలేకయే వహించి దీక్షతో సమాజసేవచేయుచున్నారు. వారి నిస్స్వార్థ సేవను పరిగణించి వారి ముద్రితాముద్రితగ్రంథములను, వ్యాస ములను ప్రకటించుట మన పవిత్రకర్తవ్యము ఈకార్యమును నిర్వహించుటకొరకు స్థాయిసంఘమేర్పడవలెను. దానికి నిధిసేక రణమావశ్యకము, ఈస్థాయిసంఘమే యాంధ్రభాషలోని యముద్రిత వీరశైవ వాఙ్మయమును సేకరించి దానిని ముద్రించి ప్రకటించవలెను. రాష్ట్రసంఘము పక్షమున ప్రస్తు

తము ప్రకటితమగుచున్న "స్వధర్మ" పత్రిక స్థిరముగా నిల్చు టకు ప్రచారమొందుటకును తగినకృషి యొనర్పవలెను. ఇత్యాదికార్యములకు విశేషధనసాహాయ్యముగావలయునుగాన స్థాయిసంఘమువారు కర్ణాటకాంధ్రి మహారాష్ట్ర ద్రావిడ మండలములనున్న వీరశైవసమాజములకు, సారస్వతసంఘము లకు, మఠాధిపతులకు, అఖిలభారత వీరశైవమహాసభకు విజ్ఞప్తి గావించవలెను. ఈమహానిర్ణయములను నేను అధ్యక్షస్థానము నుండి ఈఅధివేశమునందుద్ఘాటింపబోవుచున్నాను. ఈమహా సభ అత్యంతావశ్యకముగ బూనుకొనవలసిన యింకొకమహాకా ర్యకార్యక్రమ మేమనిన,

## వచన వాఙ్మయ ప్రసారము

వచనవాఙ్మయము విశ్వసాహిత్యమునం దున్నతస్థాన మలంకరించుట కర్హతగలిగియున్నది. వచనకారులు బహు కాలమునుండి రాజ్యలక్ష్మియొక్క తొత్తుగానుండి విశిష్టవర్గపు వారి సొత్తుగానుండిన సాహిత్యదేవియొక్క భండారమును నిర్ల క్షించి, తమ భావమను టంకసాలయందే అచ్చుకొట్టిన వచన నాణ్యములను పండిత పామరభేదములేక సర్వజనాంగమునకు పంచిపెట్టినారు. దేవవాణికి జనవాణి సమానమగుట యసంభ వమైయుండిన కాలమున వచనకారులు జనవాణినే దేవవాణి మట్టమునకు లేవనెత్తినారు. ఈ వచన సాహిత్యక్షేత్రము నందు అన్నివర్గముల వారికి, స్త్రీలకు నవ్యాహతముగ ప్రవేశ

ముండే, ఆయుగపు సాహిత్యము జనులకుఁగాను, జనులచే రచింపఁబడిన జనతా సాహిత్యమైనది. విశ్వతోముఖమైనది. ఈసాహిత్యమునందుగాననగు స్త్రీలసంఖ్య వేఱేయే సాహిత్యమునందుఁగానరాదు. ఉపనిషద్వాక్యముల కంటె మిన్నయైన నుడివితానముల నల్లినఅక్కమహాదేవి,ముక్తాయక్క,నీలాంబిక మున్నగు యోషామణులు ఈసాహిత్యక్రాంతికి దోహదమిచ్చినారు. హృదయకుహరమునుండి వెలువడినేరుగా హృదయకుహరముఁజొచ్చు శక్తిమంతమైన శైలియొకటి పుట్టినది. ఆశైలికిఁదగినట్లు రగడ, షట్పది, ద్విపద మున్నగుజాతీయచ్ఛందోమార్గములు. రూపితోవచ్చినవి. సాహిత్యమునకు జనజీవమునకు నికటమైన సంబంధము కూర్పఁబడినది. సాహిత్యము మానవజీవితముయొక్క అంతరంగ బహిరంగములను నిర్మలముగావించి దానికి మెఱుగునిచ్చి సత్యసౌందర్యములదర్శనముగావించినది. ఒక యాంధ్రపండితుఁడు నుడివినట్లు ఈ వచనములు భవరోగహారకములు. నైతిక, సామాజికాధ్యాత్మికాద్యనేకవిశేషములను సుబోధకము గావించునవి. ఇవి కేవలము వీరశైవులకే గాక అన్యమతస్థులకు, జిజ్ఞాసువులగు ముముక్షులకెల్లరకు నత్యంతోపకారకంబులై, భవతారకంబులై యున్నవి. ఈసాహిత్యమున ప్రధానములైన బసవేశ్వరవచనములకు, అక్కమహాదేవి వచనములకుఆంధ్రానువాదములను గావించి ప్రకటించుట యత్యంతావశ్యకము. ఈ ఉద్యమమున

నాశక్తి కొలది సేవగావింప నేను సిద్ధముగ నున్నాడను. శ్రీబండారు తమ్మయ్యగారి సాహాయ్యసహకారములు నాకు న్నవి. ఇత్యాదికార్యక్రమములను మహాసభవారు చర్చించి యోగ్యములైన నిర్ణయములనుజేసి కార్యక్షేత్రమునకుదిగి నవోదయమునకు కారణులగుదురనియాశించి యింకొకతూరి రాష్ట్రసంఘము వారికి నాకృతజ్ఞతను దెల్పి యింతటితో విర మించెదను.

ఓం తత్సత్.

కృపిగావించి చరితార్థత నొందుదురుగాక యని ప్రార్థించు చున్నాను. బసవేశ్వరుని తత్త్వము, చరిత్రము గ్రహించుట కితరులు వ్రాసినకృతులు కన్న నాతడు స్వయముగ గేయరూపకములుగ రచించిన వచనములే యెక్కువ ప్రామాణ్యమును వహింపగలవనుట నిర్వివాదము. రానురాను ప్రక్షిప్తములు కూడ గొన్నిచేరి యాపేరితో వ్యాప్తిలోనికి వచ్చినను, శైలి, భాష, లాలిత్యము, మాధుర్యము మున్నగు విశేషము లబట్టి కర్ణాట విద్వాంసులు వానిని వేఱుపఱుప గల్గుదురనియే నావిశ్వాసము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనునట్లు ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు భగవంతుడే దాని నుద్ధరించుటకయి యవతరించునని భారతీయుల విశ్వాసము. దక్షిణహిందూస్థానమున బసవేశ్వరుని కాలమునకు ముందిట్టి ధర్మగ్లాని గలిగి, బౌద్ధ, జైన, చార్వాకాది నాస్తికధర్మములు, ఆచరణశూన్యమగు సర్వాద్వైత ధర్మము ప్రబలి ప్రజలలో భక్తినశించి గుణములచేగాక జన్మము (కులము) చేతనే మానవుని యాధిక్యము గణ్యమై, యగ్రజన్ముల యొత్తిడి కోర్వజాలక సామాన్య మానవలోకము దారిగానక తహతహ లాడుచున్నప్పుడు ధర్మస్థాపనము, వీరమతోద్ధరణమునొనర్ప పరమేశ్వరుడే తనకు వాహనము నభిన్నుడునగు నందీశ్వరు (ద్వితీయ శంభుని) బసవేశ్వరునిగా నవతరింపజేసెనని సోమనాథుని బసవపురాణమువలన దెలియుచున్నది. మాహేశ్వరుడు